# భూమిక.

సోదరసోదరీమణులారా!

నేను చెప్పెడి యీ చిన్నవిన్నప మాలకింప వేఁడుచున్నదానను. నేను నవలరూపముగా ఒక చిన్నపుస్తకమును రచియింప వలయునని పూనితిని. ఐతే నేను స్వల్పవిద్యార్థి నవుటచే నిది కష్టసాధ్యమైనదని నా మదికి తోఁచుచున్నది. ఎట్లయినను వ్రాయ నెంచితిని గనుక వ్రాయుచున్నాను. ఇది కేవలము వేడుకకొఱకు వ్రాయుటయే కాని దీనియందు సారమున్నదని కాదు. కాన ఓ చదువరులారా! దీనియం దెంతమాత్రము తప్పులెన్నకయు దీనిని పరిహాసింపకయు ఆదరింతురుగాక యని నమ్మియున్నదానను. ఎట్లు ప్రారంభించుటయో తెలియకున్నది. సదా సంతసము గూర్చునది ఉద్యానవనము లే గనుక మనమును అచటికిఁ బోవుదము రండు.

# ఇందిర.

---

## సింధుదేశపు ఉద్యానవనము.

చెలులు వనవిహార మొనర్చుచున్నారు. వారిలో కల భాషిణి: చంద్రికా! మన ఇందిరాదేవికి చక్కనివరుఁడు ఎవ్వఁడు దొరకునో కదా.

చం.—ఒక్క చక్కఁదనముమాత్ర ముండిన చాలదు. ఆమెకు తగినవరుఁడే అని చెప్పునట్లు సకలసద్గుణములయందును ఆమెకు ఈడుజోడై ఉండవలయును గదా. లేకున్న గోడలోని చిత్రములమాదిరి ఒక్క చక్కఁదనముమాత్ర ముండిననెందులకు ?

కల.—తలంచుకొన్నవేళకే మనదేవిగూడ నిచ్చటికి వచ్చుచున్నది. ఆతల్లిమనకొఱకే ఇటవచ్చుచున్నది కాఁబోలు! మనముపోయి వందనపూర్వకముగా సత్కరింతము రమ్ము. (అందఱును గూడుదురు. ఒక్కరినొక్కరు ప్రేమాలింగనములు కావించుకొందురు).

ఇందిర.—ప్రియసఖులారా! ఏమో చింతించుచున్నట్లు మీముఖములందు తెలియుచున్నది. అది యేమి?

సఖులు.—ఎల్లప్పుడు దేవీచింతయే కల మాకు వేఱు చింత యెక్కడిదమ్మా?,

ఇం.—ఇంతకుపూర్వము తలిదండ్రులును ఆట్లేయుండిరి. ఏమికారణమో?

చెలులు.—కారణమేమున్నది ? అంతయు నీవివాహవిషయమై ఉండవచ్చును.

ఇం.—చాలునే మీహాస్యములు.

సఖు—అమ్మా! వివాహములు హాస్యములా ? ఇది హాస్యమైన ఇంక నిశ్చయమేది?

ఇం—నాకు కోపమువచ్చును.

చం.—నీకోపము మేము క్షణముకాలములోనే శాంతము చేయఁగలము. కలభాషిణీ! రమ్మా; పూఁదోఁటకు పోయి పుష్పములనుదెచ్చి దేవికి పూజలొనరించి ప్రసన్నురాలిని గావించెదము.

ఇట్లు పలువిధములయిన సంభాషణలు సలుపుచుండఁగా దూరముగా ఒక్కగొప్పధ్వనితో ఘీంకారము ముచేయుచు పెద్దకాయముదాల్చి ఒక్కగజరాజము పరుగునవచ్చుటయు, దానిననుసరించి ఒక్కసుందరపురుషుఁడు ఒడలెఱుఁగనికోపావేశముతో ప్రళయకాలరుద్రునిచందమున ఆహస్తిని సంహరించుటకై హుటాహుటిగా అశ్వరూఢుఁడై వచ్చుటయుఁ గాంచిరి. పాప మాచెలులేమి చేయుదురు! చెఱియొక్కదిక్కునకు పరుగెత్త ప్రయత్నిం

చిరి. ఆయిందిరకుమాత్రము అట్లు పోవుటకు వీలు
కలుగలేదు. ఆమృగము కదుదవ్వుననుండుటచేతనో, లేక
ఆపురుషసుందరవదనారవిందసందర్శనముచేతనో, ఆమెకా
లచ్చోటనుండి కదలింపలేకపోయెను. పాపమారాజసింహుఁ
డు తన్మూలముగా ఈకుసుమకోమలాంగికి విపత్తుసంభవిం
చునేమోయనువ్యసనముచే ఎంతో ప్రయాసముతో ఆమా
ర్తిని సమీపించి తనతీవ్రముగుఖడ్గమునకు విభ్రమముగా
వచ్చు గజరాజమును నేలఁగూల్చెను. ఆభయముచేతనో,
లేక అప్పుడు కలిగిన మోహతాపముచేతనో, ఇందిరాదేవి
మూర్ఛితయయ్యెను. అట్టి యవస్థపాలై యున్న జగన్మో
హనాకారసుందరిచెంతఁగూర్చుండి యతఁడుపచరించుచు మ
నీవిధముగా తలపోయుచుండెను 'ఆహా! ఈచెడుమృ
గమును జూచి యీతన్వి యెట్లుమూర్ఛిల్లియున్నది? ఏమి
చేయుదును! అయ్యో! నామూలమునఁగదా ఈయబల కిట్టి
పాటువచ్చెను! అదియేమి దైవయత్నమో కాని ఈము
ద్దులమూటను, ఈరత్నముల రాశిని, ఈజగన్మోహినిని, జూచి
నప్పటినుండియు ఎక్కడలేని ప్రేమ జనియించుచున్నది
గా! ఇప్పుడు ఈమె కెట్టిపాటుకలిగినది! అయ్యో! నేనేల
యాకరిరాజును చూడవలయు? చూచిననేమి? ఈవనమున
కేలరావలయు? వచ్చితినిపో! ఈపొగసులకుప్ప వారితో నే
అదృశ్యకారాదా? అప్పు డీమె కిట్టికష్టము వచ్చియుం
డదుగా! అకటా! ఎంతతప్పుఁదలంచితిని! అట్లు జరిగియుం
డిన ఈసుందరీమణిసందర్శనము నాకు లేకుండుఁగా! ఎన్ని

కష్టములకైనను ఓర్చుకొందునుగాన ఈవనలక్ష్మి ఈరమణీమణి దర్శనము కలిగెను. తలంచిచూడ నాకేమికష్టము కలుగలేదు. నిత్యశుభాంగి యగు నీయలివేణిసందర్శనము కలిగె! ఇది కష్టమా? నేనెంతవెఱ్ఱివాఁడను! సుఖము కలిగినప్పుడు కష్టముగానెంచుచున్నాను. నిక్కముగా నాకు పిచ్చిపట్టినది. కష్టమంతయు నారమణికేకదా! నాకైననేమి? నాహృదయము నిండియున్నప్రియురాలికైననేమి? ఏమి! నాకేమి ఉన్మాదమా! ఈబిడయెవ్వతి? ఈ మదిరాక్షితలిదండ్రులెవ్వరు? ఈకామినీమణి వివాహితయో, కాదో, నాకు ఒక్కటియు తెలియక యిట్టిభ్రాంతివహించుట పాడియా? ఇచ్చటనే మఱియొక నిమిషము నుండి యీసుకుమారికి మెలఁకువ కలిగినపిదప మందహాససుందరవదనారవిందముతో చెలువొప్ప దొలఁకాడ తేనెలొలుకుపలుకుల నొక్కటినయినను ఆలకించి కృతార్థుఁడయ్యెదఁగాక.' (ఇందిర కొంచెము కదలును).

రాజ.—'హృదయమా! ఊరడిల్లుము. మంచికాలము ప్రాప్తించుచున్నట్లున్నది' అనుకొనెను.

ఇం.—(కనువిచ్చిచూచును; అప్పుడు ఒకసుందరమూర్తిని గాంచి మహానందపరవశయై లేచి నమస్కరించి) 'ధీరపురుషపుంగవా! నాకు ప్రాణదానముచేసినపుణ్యపురుషుండవగు నీకు వినయపూర్వకముగా వందనము లాచరించుచున్నాను. నీయట్టిమహోపకారికి ప్రత్యు

పకారరూపముగు వచనమైనను పలుకుటకు నాచేతఁ గాకున్న దే! నేనేమిచేయుదును?

రాజ.—అలివేణీ? నీ వంతగా చెప్పనక్కఱలేదు. నేను విశేషించి యేమియుచేయలేదు. రాజులు చేయవలసినకార్యమే చేసితినిగాని, యిందు శ్లాఘనీయమగు విశేషోపకారము మఱియేమియు లేదు.

ఇం.—వీరపురుషులు తాము గావించినదిఘనకార్యముగా నెంచరు. అట్టి యుత్తమపురుషుండ వగుటచే నీవిట్లు పలికితివి. ప్రాణరక్షకా! నేను నిన్నొక్కటి యడుగవచ్చునా?

రాజ.—కాంతామణీ! నీవడుగఁదలంచినదేమో నిశ్శంకముగా వచింపుమా; సంతోషముగా చెప్పెదను.

ఇం.—రాజచంద్రమా! నీపుణ్యచరిత్ర మింతవినవలయునని నామది కుతూహలపడుచున్నది. చెప్పఁదగునేని చెప్పుము.

రాజ.—సుకుమారీ! నేను మగధాధీశుని పుత్రుఁడను. నా పేరు రాజశేఖరుఁడందురు. నాకుచిరకాలమునుండి వేఁటయందు మక్కువకలదు. నాతలిదండ్రులకు నేనేకపుత్రుండ నగుటచే వారందులకు నీయకొనరయిరి. ఎట్లో మెప్పించివచ్చితిని. చాలదూరమునుండి యీ గజరాజమును తఱుముకొనివచ్చి యిచ్చటచేరితి నని మఱి చెప్పనవసరము లేదు. నాజన్మకాలములో మఱియే

మియు విశేషము లేదు. ఇప్పుడు సుఖదుఃఖముల కెంటికిని సమయము వచ్చినది. ఇందులకు అర్థ మేమన:— నీవనుగ్రహించినట్లయినచో సుఖము తప్పక కలుగఁగలదు; లేనిచో దుఃఖముననే నాకాలమంతయుఁ గడవఁగలదు. విశాలాక్షీ! నీ వనుగ్రహించి యే పుణ్య దంపతులకు, ఎట్టిపూజచేత జన్మించితివో ఆతలిదండ్రు లెవరు? తొలిజన్మమున ఎట్టిఘోరతప మొనరించి యెవ్వఁడీజన్మమున నిన్ను సతిగాఁబడసెనో, ఆపుణ్య పురుషుం డెవ్వఁడు? నిమ్మళముగా నాకంతయు నెఱింగింపఁ గోరుచున్నాను.

ఇం.—రాజశేఖరచంద్రమా! నేను సింధుదేశపు రాజపుత్రిని. నా పేరు ఇందిర. నా చెంతనుండినవారు నా నెచ్చెలులు. నాకింతవఱకు వివాహముకా లేదని చెప్పుటకు నాపూర్వజన్మపుణ్యమే కారణము.

రాజ —ఇందీవరాక్షీ! నే నింకఁ దాళఁజాలను. నిన్నుఁ జూచినప్పటినుండి నీపై నాకు ప్రేమ జనియించియున్నది. 'నీ వొకవేళ వివాహితవే యైనయెడల నెట్లు చెప్పుదును' అని యింత సేపు ఓర్చుకొంటిని. ఇప్పటి నీప్రతివచనముచే నాహృదయశూలముగానుండిన యాశంకను మాన్పివైచితివి. ఇప్పుడు నిర్భయముగా వచియించెదను. నీవునన్ను 'అవివేకి' వన్ననుసరే, మఱియేమన్నను సరే, అనుము. కాదనను. నీవనుగ్రహించినట్లయిన ప్రాణదానము చేసినదానవగుదువు.

మఱియొక్క విధముగా పలికితివా, నీసాన్నిధ్యమున నే ప్రాణత్యాగము చేసికొనియెద నెట్లు పలికినను సమ్మతమే.

ఇం.—'హరిహరీ! ఎట్టిమాట యాడితివి. నాకు ప్రాణదాతయు నా ప్రాణనాథుండు నగు నీవు నోరార నిట్టి కఠినంపుఁబలుకులాడఁగా నే విననోల్లను. హృదయేశ్వరా! ఆలకింపుము. నేను నిన్ను దవ్వుదవ్వుల చూచినప్పుడే, అదియేమి దైవాధీనమో నీయందు మితిలేని ప్రేమ జనియించినది. నీయందే యేకదృష్టితో నుండినందున ఆగజము వచ్చుటనుగూడ సరకు చేయక, తుదకు నాసూరిమి చెలులు పరుగిడునప్పుడయినను వారితోడఁ జనక, పరవశురాలనై యట్లే మూర్ఛిల్లితి, (పనుమ నించుక లజ్జితయై) 'నీ యనుగ్రహమునకు పాత్రురాలనైతి'నని చెప్పి క్రీఁగంటిచూపులతో చిఱునవ్వు దొలఁకాడ 'ఇట్లు పలికెడి పురుషుల మోహము నిశ్చలమైనది కాదు. ప్రతిసుందరాంగిసమక్షమునను వారిట్లే పలుకుదురు. కాన, యిప్పుడే నాయభిప్రాయము చెప్పుటకు వెనుదీసితిని. మనోహరా! నాకు నీయందుఁ గలిగిన ప్రేమ క్షణభంగురము కాదు. అది సహస్రయుగస్థాయిసుమీ'.

రాజ.—'తరుణీ! ఇప్పుడు నీవు పలికినపలుకులచేత నాయానందమునకు మేర లేదు. ఏదీ! కండచక్కెరకన్నను ద్రాక్షాదిమధురపదార్థముల కన్నను మిన్నగానుండు తీయని ముద్దునొక్కటినిమ్మా!' అనుచు ముద్దుపెట్టెను. అప్పుడు ఇందిర శృంగారలజ్జచే ముఖము వాల్చెను.

ఇట్లు వారిరువురుపరస్పర ప్రేమానురాగమున మేనెఱుంగని మోహావేశముతో నుండుటచేత ఇతరవ్యాపారములు వారికంటికప్పుడు గోచరమగుట కష్టసాధ్యమని చెప్పవలయునే. ఇంతకుపూర్వమే పొగడచెట్టుచాటున పొంచి యుండిన యిందిరసఖులు ఆవిషయమును సవిస్తరముగాఁ జూచుచుండుటచేత వారిరువురు నివ్విధముగా ముచ్చటించుచుండిరి.

చం.—కలభాషిణీ! కొంతమునుపు వివాహమన్న మన దేవికి ఎంత కోపమువచ్చును! ఎంతో వైరాగ్యము పూనినట్లు ఉండెగా! ఇంతలోనె ఈదేవికి ఎట్టిభంగి కలిగె! చిరకాలము సంసారసుఖమున మునిఁగి తేలిన వారికైనను ఇట్టి పతిభక్తి అలవడియుండదుకదా! పాప మీవధూవరులకు ఎట్టిభంగమును కలిగింపక దైవము వీరిని శీఘ్రకాలములోనే వివాహితులుగా చేయుఁగాక. మనమొపినకోలఁదిని ఇందులకు సహాయము చేయవలయు. నామది ననుసరించి వర్తింతువుకదా.

క.—అందులకుబాసచేసెదను వీరిరువురు ఒక్కరినొక్కరు ఎడఁబాయఁజాలకున్నారు. మనదేవికి ప్రాణదానమొనంగిన వాఁడగుటచే ఈరాజనందనుని గౌరవపూర్వకముగా అంతఃపురమునకు దోడుకొని పోవుదమా?

చం.—దేవినిరాజశేఖరుఁడుపట్టియున్నాఁడు.నిన్ను నిక్కముగా నీవనదేవతయె పట్టినట్లున్నది. ఎందు కింత

యాత్రము? ఏమి జరుగునో చూతము. సమయము
వచ్చినప్పుడు సహాయుల మయ్యెదము.

అని పలు తెఱంగులుగా మాటాడుచుండిరి. ఇంతలో

ఇందిర.—ప్రాణేశ్వరా! ని న్నొకటి వేడుదానను.

రాజ.—అలివేణీ! నీవు ఆజ్ఞాపించిన చాలదా? వేఁడవల యునే? నీవు చెప్పునది మన యిరువురికిని సదుద్దేశమే యైనచో తప్పక జరిపెదను. మధురభాషిణీ! ఏదీ! ఆ యాజ్ఞ.

ఇందిర.—భూరమణా! నీవు ప్రాణదాత వగుటచే నే నిప్పుడే పోయి మాజననీజనకులకు నీవృత్తాంతమును దెల్పి వారి నిచ్చటికి శీఘ్రకాలములోనే తోడితెత్తును. పిదప వారే నిన్ను సగౌరవముగాను వినయపూర్వకముగాను అంతఃపురమునకు పిలుచుకొనిపోఁగలరు. అచ్చటనీవు రెండుదినములు విశ్రాంతి పొందుము. నేనింతలోనే మాతల్లిదండ్రులను ఒప్పించి, కాదు - మెప్పించి- నీదాసియు అర్ధాంగలక్ష్మియు అయ్యెదను. ఇదియే నా యభిప్రాయము.

రాజు —కలకంఠీ! నీవు మధురమయిన వచనములచే నా మదికి నానందముఁగూర్చి పలుకుచుండఁగా కఠినములై శూలములపగిది నీకు తోఁచునట్టి వార్తలను చెప్పలేకయూరకుంటిని. ఒప్పునే నీమతము? నామీఁది ప్రేమచే నీవట్లు పలికితివి గాక. నీకు తెలియని నీతి

కలదే! రాజులు అనాథరక్షకులే కదా. అట్లు అనాథవై అబలవైయున్న నిన్ను ఒక్కదుష్టమృగము బాధింపనెంచినపుడు నే నా క్రూరమృగమును సంహరించినది ఒక్కగొప్పకార్యమా? రాజులు చేయఁదగిన కార్యమే చేసితిని. ఇంతటియల్పసహాయము చేసినందులకే, ఆడంబరముతో, నేనెట్లు నీతండ్రి సమీపమునకు రాఁగలుగుదును. ఇప్పుడుమాత్రము నాయందు అనుగ్రహించి నన్ను పంపుము. మఱియొక్క విధముగా మీయూరికి వచ్చి నిన్ను పాణిగ్రహణముచేసి కొనియెద కఠినహృదయుఁడనని నన్ను దూఱకుము. యుక్తాయుక్తములను పరిశీలించియే పలికితిని. కాని, యూరక అవివేకమునఁగాదు.

ఇం.—(హీనస్వరముతో) అయితే నాకు సెలవా?

రాజ.— తరుణీ! పోయెదవా? నన్ను మఱవవు కదా.

ఇం.—నాథా! నే నిప్పుడు చెప్పఁబోవు విషయమునకు నాహృదయ మొక్కసాక్షి; అద్దైవ మొక్కసాక్షి; ఈ వనదేవతయు గంగాదేవియును ఇందులకు సాక్షులగుదురు గాక. నే నాఱుమాసములవఱకు వ్రతధారణముతో కాలమునుగడపెద. అవ్వలనొక్క దినమయినను తాళఁజాలను. ఈయాఱుమాసముల లోపలనే నీసందర్శన మొసఁగి నీయర్ధాంగిగా నన్ను మన్నించితివేని నాయానందముఁ జెప్పఁదరముగాదు. పిదప నొక్కదినమయినను గడచెనా, ఎవ్వరికొఱకు

ఈయాఱుమాసములుగా ఎంతోకష్టముతో ప్రాణ
ములునిలిపితినో, ఎవ్వరిమాటన్న నాకు పరమానంద
ముకలుగునో, ఏపుణ్యపురుషుని దర్శనముచేత నాజ
న్మము పావనమగునని తలంచియున్నానో, అట్టి నీదర్శ
నము కలుగదేని, తప్పక అగ్నిప్రవేశము గావించె
దను. ఇంతకన్న నేనెక్కువ చెప్పనేరను.

రాజశేఖరుఁడు.— తన ప్రాణసమానురాలైన ప్రియురా
లినోట అట్టిదుఃఖకరమగు వార్త వినఁజాలక కన్నీ
రు దుడుచుకొనుచు 'ప్రాణసఖీ! వినుము. నాకును
వేళ అయినది. మందభాగ్యుండనగు నాదుమూలము
నం గదా నీ కిట్టి దుఃఖము కలిగినది. విశేషించి చెప్పుట
కు నోటనొక్కమాటయైనను పలుకఁజాలకున్నాను.
నిన్నిట్టినిర్జనవనమందు ఒంటరిగా విడిచిపోవుటకు
నా కాలాడకున్నందున నింతసేపుంటిని. అచ్చట
నెవ్వరో వచ్చునట్లు పాదధ్వని వినబడుచున్నది. ఈ
చెలులు నిన్ను వెదుకుచువచ్చుచున్నారు కాఁబోలు.
నాకు సెలవిమ్ము. నీ వాడినకాలములోనే నిన్ను వివా
హము చేసికొనుటకు ప్రయత్నించెదను. అట్లు కాల
ముమీఱెనా, యీకరవాలము నా జిహ్వ ...' అ
నెను. కాలవిలంబమైనచో ఎవ్వరైనను వత్తురేమో
యను భీతిచే విశేషించి చెప్పలేకపోయెను. అతఁడు
కడపట నొకముద్దుమాత్రము గైకొని తన తురగ
మును వేగముగా నచ్చటనుండి నడపెను. ఇంతలోనే

సూర్యాస్తమయ మగుటచే ఆ వనమంతయు నీరెండలచే స్వర్ణమయమై కనుపట్టుచుండెను. అప్పుడు పక్షులంతయు తమతమ నెలవులకు అతివేగముగా గగనమార్గమున పోవుట చూచుట కెంతయు సొంపుఁ గూర్చుచుండెను. చెలులిట్టి సాయం సమయములో తమ దేవి యొంటరియై యుండుట చూడఁజాలక అతిశీఘ్రముగా తమప్రియసఖిని గూడుకొనిరి; కాని, తమ రాకనైనను తెలిసికొనఁజాలకున్న యిందిర యవస్థను జూచుచు చెలు లాబిడతో 'అమ్మా! *ఆమృగదర్శనముచేతఁగదా నీకు నిట్టి పాటుగలిగె. ని కామృగరాజు ఎంతగా అపరాధము చేయనెంచెనో' అనునంతలో.

ఇందిర. నా కామృగ మేమియు హాని కలిగింపలేదు. అయినను నాశరీర మిప్పుడు నాకు వశముగా కున్నది.

సఖులు.—(తమపయ్యెదచెఱఁగులతో విసరుచు) సఖీ ఇందిరా! నీకు ఈగాలి సుఖముగానున్నదా?

ఇం.—సఖులారా! ఏల నాకు వీచెదరు?

సఖులు.— విషాదముతో 'ఈమె నిక్కడనుండి అంతఃపు

---

* తమ ప్రాణసఖి ప్రార్థన మంగీకరింపక రాజకుమారుఁడు దుఃఖసముద్రమునఁ ద్రోసిపోవుట క్రూరత్వమని యెంచి మృగప్రాయుండగుట చేతనే అట్లు చేసెనను భావముచే అతనిదర్శనమును మృగదర్శనమని పలికిరి.

రమునకుఁ దోడుకొనిపోవు విధమెద్ది?' అని యొండొరులను చూచుకొనిరి.

కల.—'చంద్రికా! తెలిసెను. మనసఖి యీమార్గము వలన తనకునెట్టి బాధయు కలుగ లేదని చెప్పెను గాని, యీ రాజేంద్రునిఁ దొలుసారి చూచినది మొదలు మిక్కిలి యుత్కంఠితయై గాసిల్లుచున్నది.

చం.—నాకును అట్లే తోఁచుచున్నది.

కల—కానిమ్ము! నేనే దీని నడిగిచూచెద (ప్రకాశముగా) 'సఖీ! నిన్నొక్కమాట అడుగవలసియున్నది. నీకు సంతాపంబు మెండుగానున్నది సుమా.

ఇందిరకొంచెము తలయెత్తి హీనస్వరముతో 'చెలులారా' ఏమి యడుగఁ గోరెదరు.

చెలులు. నీ ఆయాసమునకు కారణమేమి ? మాకూడినంతవఱకు సహాయముచేసెదము. దాఁపక వచియింపుము.

ఇం.—(స్వగతముగా) నాకాయాసముమెండుగా నున్నది. ఏమిచేయుదు! వీరితోనేను తటాలున చెప్ప లేకున్నాను.

చం.—నీవుచెప్పకున్న మే మీావనమునుండి కదలు వారముకాము. ఇఁక నొక్కగడియ అయ్యేనా నిన్ను వెదకుచు నీజననీజనకులే యింటు రాఁగలరు. అప్పుడు

నీయవస్థలంతయు వారెఱుఁగఁగలరు. లేకున్నను నీకు చెప్పక తీఱదు.

ఇం.—ఇఁకఁజెప్పకున్న విధిలే'దని తలఁచి లజ్జతో 'సఖులారా! మీకుఁగాక మఱియెవ్వరికిఁ జెప్పుదును. కాని, చెప్పినచో మీకు ఆయాసము కలిగింతును.'

ఇరువురును—కావున నే నిర్బంధము. మిత్రజనము పంచుకొన్నఁ గదా దుఃఖము సహింప శక్యమగును.

ఇం.—ఆ రాజచంద్రునిఁ జూచినప్పటినుండి నాకు ఆయనయందు అనురాగము మెండై యున్నది. ఇంకేమి చెప్పఁగలను? నాభాగ్యవశముచేతనే అతనికిని నాయందు అట్లే యున్నదని మీకు తెలియునుగదా. ఇట్టి మా యిరువురపరస్పర ప్రేమానురాగమునకు తగిన ఫలము, ఇంక నాలుమాసములలోపల కంటిమా మేము ధన్యులమయ్యెదము. లేదేని నాకు జలాంజలి నిచ్చి వేయుఁడు.

కల.—చంద్రికా! మనచెలి యాపుష్పకోదండునిబారికి చిక్కి మైమఱచియున్నది. ఇప్పుడీమెను అంతఃపురమునకుఁ దీసికొనిపోయి, యనంతరము కార్యసాఫల్యమునకై యాలోచింతము. ఇప్పు డుపవనమంతయు చీకటిక్రమ్ముచున్నది. ఇఁక తడసితిమా కష్టము కలుగును. అమ్మలో! నీవింక త్వరగా నడువుము. సౌధాంతరమున అంతయు పర్యాలోచించి తగిన ప్రయత్నము

చేసెదము. నీవు వట్టివెఱ్ఱితల్లివి. ఇంత యరయ
నేరవా? నీకాతనిపై మోహమున్నంటివి. ఆతనికి నీపై
మఱియెంత కూరిమి కలదని పలికితివి. చేతిలో వెన్న
నిడుకొని నేతికై యేల చింతింపవలయు? మీయిరువు
రకు సమ్మతమైన ఇఁక లోకసమ్మతమైనట్లే. మేముండఁగా
నీకేమిచింత! చింతమానుము. ధైర్యమునొందుము.
త్వరగా మా వెంటరమ్ము' అని ఆమెను అంతఃపురము
నకుఁ దోడుకొనిపోయిరి.

## ఇందిరాదేవి యంతఃపురము.

మంచముపయిని ఇందిర పండుకొనియుండెను. ప్రక్క
నున్న రెండుపీఠములపై ఆమెతలిదండ్రులు చారుమతీ
వసంతసేనులు ఆసీనులై యుండిరి.

చారుమతి.—తనయా! నీవిట్టి భంగి నొచ్చుట తగునా?
నీమేలు కోరియే కదా యాచక్రవర్తిని పెండ్లియాడు
మని చెప్పుచుంటిమి. ఇంతియాలోచింపవలదే? ఆతఁడెం
తో సుందరాంగులు తనయడుగులపైఁబడి వేఁడినను
వలదని నీయందే మనస్సునిలిపి నీకొఱకై యువిళ్లూ
రుచుండుట నీభాగ్యముకదా! ఇంత నీవు తలఁపవలదా?
నీవు చక్రవర్తినివై ఆసార్వభౌమునికి గృహలక్ష్మివై
యుండ మేము మాపాపపుఁగన్నులార చూడ నోఁచ
మైతిమి. నీవువలచినపురుషుఁడు సుందరుఁడే; చక్రవ
ర్తికన్నను గుణవంతుఁడే, కాదనము. అతఁడు సార్వ
భౌముఁడు కాఁడుగదా?

౩౦.—'అమ్మా! నేను ప్రేమించినది గుణమునా? ధనమునా? నాకు గుణవంతునియం దున్నంత ప్రేమ ధనవంతునియందు లేదు. అమ్మరో! వేయేల? నాయందు మీకు ప్రీతికలదేని, నామేలుకోరువారేని, నాకా రాజశేఖరునిఁ గూర్పుఁడు. లేదేని, నాయాశ నింకవదలుఁడు. తల్లిదండ్రులారా! నామాట యొక్కటి ఆలకింపుఁడు. నామేన ప్రాణములుండువఱకు నేనాడి తప్పుదానను గాను. ఆనాఁడు నాప్రాణనాథునకు నమ్మకి మూకలుగుటకై నే నెట్టి ప్రతిజ్ఞ జేసితినో దానిని నేను మఱవ లేదు. ఆప్రతిజ్ఞ యెల్లప్పుడును నాహృదయమందు నిండియున్నది. కనుక మీపలుకులను శిరసావహింపవలసినదై నను మించిన కార్యమునకు చింతించి ప్రయోజనము లేదు. నే నాతనిఁ దక్క నింకొక్కని చేపట్టనని చెప్పితిని. అగ్నినైన నుఱుకుదునే కాని ఆఁడి తప్పఁజాలను. నాయందు మీకు దయగలదేని ఆచక్రవర్తి ప్రశంస నాచెవిని బడకుండఁ జేయుఁడు. నామేలు కోరుదురేని, నన్ను అతిశీఘ్రముగా నారాజశేఖరుని కిచ్చి వివాహము గావింపుఁడు. నాయభిమతము తమకు నెఱుఁగఁ జేసితిని. ఇఁక మీయిష్టము. దైవమిందులకు సహాయము చేయుఁగాక' అనిపలికి యొక్క పెద్ద నిట్టూర్పు విడిచి కొంతసేపేమియుఁ బలుకక మ్రాను పడియుండెను. అంత వసంతసేనమహారాజు తన ప్రియురాలిని జూచి, తరుణీ! ఇప్పుడు నామనస్సునందు

ఇట్లు నిశ్చయించుకొనియున్నాను. ఏమి చేసిన మన తనయకు సమ్మతమగునో యద్దానినే నేను జేయు వాఁడను. కావున నిప్పుడే వెళ్లి వివాహప్రయత్నము గావింతము. ఇఁకఁదడసితిమేని మనతనయ ప్రాణములు నిలుపునో లేదో అనుశంక నామదిని పీడించుచున్నది. కాన, బ్రాహ్మణోత్తముల రావించి అతిశీఘ్రముగానే ముహూర్తము నిశ్చయింప ఆజ్ఞాపించెదను. నీవు నీ పనులన్నియు నాయితపఱచుటకై తగిన పరిచారకుల నియోగింపుము' అనెను

చారు.—'అట్లెచేసెదఁననెను. అందఱును పెండ్లిప్రయత్నములు గావించుచుండిరి. ఇక్కడ నిట్లుండఁగా ఆ రాజశేఖరునివిషయము కొంత విచారింతము. పాప మా రాజశేఖరుని మనస్సును రెండువిధములగు శంకలు పీడింపఁదొడంగెను; ఒక్కటి- 'ఆమె తలిదండ్రులు చక్రవర్తికిఁ గాక తనకు నిత్తురా' యనియు, మఱొక్కటి 'ఆఱుమాసములపై నామె జీవింపననిపలికెనే ఇంతలోనె మూఁడుమాసములు గడచెను. తక్కిన మూడుమాసములలో ఎట్టి ప్రయత్నములు చేసినను మన కార్యముఫలించునా' అనియు నుండెను. ఇట్లతఁడు పలువిధములుగా చింతించుచు ఏమియు తోఁపక వెట్టివానివలె చూపట్టుచుండెను. మనోవ్యాధి బలీయమగుటచే నతఁడు దినదినమునకు కృశించి పోవుచుండెను.

ఒక్కనాఁడు అతని తలిదండ్రులు పుత్రునియవస్థ నెఱింగి యతనితో "నాయనా! మనము వినలేదా 'ఆ రాజపుత్రిని చక్రవర్తి ప్రేమించియున్నాఁ' డని. ఇట్టివానికిఁ గాక మనకు వా రిత్తురా? అందని మ్రానిపండ్ల కాసపడుటచేత నేమిఫలము? ఇట్లు ఇందిర నిన్నుఁ దక్క మఱియెవ్వరిని పెండ్లియాడనని ప్రమాణముచేసెను గనుక దాని జననీజనకులు దానియిష్టముచొప్పున నీకిచ్చి వివాహముచేసినను చక్రవర్తిమూలముగా మనకు నెబ్బర సంభవింపక తీఱదు. కనుక నీవాయపేక్ష మానుకొను' మని పలువిధములుగా పలికిరి కాని వారిమాటలతనికి సమ్మతములు కానందున సదా దుఃఖితుండై యుండెను. ఒక్కనాఁడా రాజశేఖరుఁ డిట్లు తలంచెను. 'మన మారమణీమణికి నిచ్చినప్రతిజ్ఞవలన ఇంక పక్షముదినములలో నాకు తప్పక మరణము కలుగఁగలదు. మరణకాలమందైనను నాప్రియురాలి కిడపటిమాట నొక్కటైనను వినవలయునని నామది తుకతుకపడుచున్నది. అది వట్టియాశ. చావసిద్ధుఁడుగా నున్నవానికి ఎక్కడి ప్రియురాలు! ఎక్కడి ప్రపంచము! ఇచ్చట కాకున్నను, ఆలోకమందైనను నాప్రియురాలిని నేనుఁ జేరఁగలను. ఇఁక మాయిరువుర తలిదండ్రులును దప్పక దుఃఖసాగరమున మునుఁగఁగలరు. హా! దైవమా! ఎంతకష్టము తెచ్చితివి? సదా నిన్ను నమ్మినందులకు నాకిదియా ఫలము? అనుచు ఏమోమో చింతించుచుండెను. ఒక్కొక్కసమయంబున తాను ఇందిరను పెండ్లియాడి

నట్లును ఆబిడ సిగ్గుచే తనతోడ పలుకకుండుటచే తాను మిక్కిలి వినోదప్రశ్నములతో నామెను పలుకరించునట్లును భావించి యట్టిసమయమున ఎంతసంతోషముకలుగునో అంతయానందమును పొందును. తిరిగి యొకప్పుడు తనయవస్థను తాను దెలిసికొని దుఃఖించుచుండును. అప్పుడొక్క సేవకుఁడువచ్చి 'సింధుదేశమునుండి ఎవ్వరో బ్రాహ్మణోత్తములుశుభలేఖను గొనివచ్చియున్నారు. తండ్రిగారు సభామంటపమున తమకొఱకై యెదురుచూచుచున్నా'రని సవినయముగా చెప్పెను. అప్పుడు రాజశేఖరుఁడు మనంబున నివ్విధముగా చింతిల్లెను.

'ఆహా! శుభలేఖవచ్చె ననికదా మనసేవకుఁడు చెప్పెను. ఆలేఖ ఇందిర వివాహలేఖయై యుండవచ్చును. అంతయు తెలిసెను. పాప మామె సమ్మతింపకయుండినను ఆమె జననిజనకులు బలవంతపెట్టి చక్రవర్తికినిచ్చి వివాహముచేయ సంసిద్ధులయినట్లు రాజులకందఱకును శుభలేఖ పంపియుందురు. ఇందులకు సందేహము లేదు. లేక స్త్రీలు కుణచిత్తలు గనుక ఇందిర సార్వభౌమునిపై ప్రేమ లేకుండినను తనచక్రవర్తినీపదవిని ప్రేమించియుండును. హా! స్త్రీ లెంతటికఠినహృదయులు! ఇందిరా! ఇంకపదుమురోజులలో నీకొఱకై పోవనున్న ప్రాణము నిప్పుడేతీసితివే! హా! రాజశేఖరా! ఒక్కయబలను నమ్మికదా తలిదండ్రులనైనను జూడక, తుదకు నీప్రాణములనయినను ప్రేమింపక, నీవు పరలోకమునకుఁ బోవ నొడిఁగట్టుకొంటి

వి. చివరకు అచ్చటనైనను నీప్రియురాలికూటమి నీకు
కలుగునని తలంచితివి. ఆయాశయు నీటఁగలసిపోయెనే!
నీవుమాత్రము ఒంటరివై యచ్చటఁబడి యేడువుము. ఇం
దిరయో నీవలె అవివేకముగలది కానందున తారతమ్య
ములు పరిశీలించి చూచి చక్రవర్తిని జేపట్టి రాజ్యలక్ష్మి
నిపొంది రాజరాజేశ్వరియై ప్రకాశింపఁగలదు' అని తనలో
తానేమేమో గొణుగుకొనుచుండి కొంతసేపటికి 'నేనెంతటి
గుణహీనుఁడను! ప్రమాణపూర్వకముగా నాచెంత పలికి
నది తాను దప్పునా? నాకొఱకై యీశుభలేఖ వచ్చి
యుండును. ఇందులకు సందేహములేదు. నాకొఱకుతన
ప్రాణములనైన నిచ్చునట్టిపతివ్రతను నేనెంత తప్పఁదలం
చితిని' అని తిరిగి 'మాజనకునినైనను అడుగకయే యెట్లు
వివాహము నిశ్చయింపఁగలరు? ఎంత నేను సమ్మతిపడితినని
వారికి తెలిసినను మఱియాదచొప్పునకైనను మాజనకుని
యనుమతి వారు పడయవలదా!' అని వితర్కించుచుం
డెను. ఇంతవఱకు ఇందిరనిచ్చున ట్లాబిడతండ్రి వ్రాసినజా
బులను ఆతనికి తండ్రి తెలుపుచుండినదంతయు నాతఁ
డు భ్రాంతుఁడైయుండినందున ఇంచుకైనను యెఱుక లేక
యుండవచ్చును. అహా? మోహ మెంత చెడ్డది! ఆతఁడు
కొంతసేపటి కంతయు నెట్లో తనమనస్సును స్వాధీనతకు
తెచ్చుకొని తనతండ్రిసభాభవనమును చేరెను. అప్పుడు
తనజనకుఁడు మిత్రవర్మ తనయుని ఆలింగనము చేసికొని
'తనయా! నేనిదివఱలోనే నీవువలచిన ఇందిర యనుసుంద

రాంగిని నీకిచ్చుటకై వారు నాయంగీకారమును బడసి వివాహప్రయత్నములు గావించుచున్నారని నీతో చెప్పలేదా? ఇప్పుడా శుభముహూర్తమును నిశ్చయించి యీ పత్రికను దెచ్చిన బ్రాహ్మణోత్తముని తగురీతిని సన్మానింపుము. మనము శీఘ్రముగానే బయలుదేఱవలయు. ఇంక విశేషించి రోజులు లేవని తనమంత్రినిజూచి 'శీఘ్రముగానే ప్రయాణమునకు సన్నద్ధులుగండని పలికి తగురీతిని చతురంగబలముల నాయితపఱచుటకై సేనానాయకునికాజ్ఞాపించి, యాయాపనులకు తగినవారిని నియోగించి సభ చాలించెను ఇప్పుడు రాజశేఖరునకుఁ గలసంతోషము చదువరులే తెలిసికొనఁగలరు. మేము వ్రాసితిమేని యెన్నియో కాగితములు నిండఁగలవు. అందఱును ప్రయాణమై సింధుదేశమునకుఁ బోయిరి.

## సింధుపురములో వివాహమంటపము.

ఈపురము చూచుట కెంతయు సొంపుకూర్చుచు సకల శృంగారవైభవములతో నిండి, యా దేవరాజ్యమో యనునట్లు చూపఱ కెంతయు ఆనందముగూర్చుచుండెను. సకల దేశముల రాజులు కొలువు తీరియుండ వివాహము జయప్రదముగా జరిగెను. అప్పుడు వచ్చినవారందఱు తగురీతిని సత్కరింపఁబడి తమతమ దేశములకుఁ బోయిరి. ఇందిరా రాజశేఖరులు ఇప్పుడు మితిలేని యానందమున మునిఁగి తేలుచున్నారని నేను జెప్పనక్కఱలేదు; చదువరులే గ్రహింపఁగలరు. ఇట్లు కొంతకాలము గడచిన పిదప రాజశే

ఖరుఁడు తన రాజ్యమునకుఁ బోవలయునని యిందిర నెచ్చ
రించెను. అప్పుడు ఇందిర దానిని తనతల్లిదండ్రులకు నెఱిం
గించెను. వారు అందులకు తగిన ప్రయత్నములు గావిం
చిరి. నావయందు ప్రయాణముచేయుట వారిరువురికీ నిం
పుగానుండుననియో, లేక అల నావికా ప్రయాణము కడు
రమణీయ మగుటచేతనో, ఆవధూవరులు నావయందు
ప్రయాణ మగునట్లు నిశ్చయింపఁ బడియుండెను. ఇందిర
చిరకాలమునుండి యెక్కడనైనను తనతలిదండ్రుల
నెడఁబాసి యెఱుంగని దగుటచే ఆమె కిప్పుడు తన ప్రియ
సఖులను జననీ జనకులను విడిచిపోవుట గొప్పసంకటము
గా తోఁచెను. అట్టిదుఃఖమును తా నెన్నఁడు నెఱుంగదు
గనుక నాఁగలేక తామరరేకులవంటి తనకన్నులంగవ
నుండికన్నీరువర్షధారలై ప్రవహించుటఁగాంచి యామె తలి
దండ్రులును అత్యంతదుఃఖించిరి. కొంతతడవు ఒకరి నొకరూ
రడించుకొనఁ జాలకయే దుఃఖించిరి. తుదకు నెట్లో ధై
ర్యము తెచ్చుకొని తండ్రి తనపుత్రికకు పెక్కుపతివ్రత
లచరిత్రము చెప్పి 'పతిని ఎడఁబాయకుండుటయే స్త్రీల
కు పాటింపవలసిన ధర్మ'మని పలికి ప్రయాణము చేయిం
చెను. ఇందిర చెలులును అట్లు దుఃఖించి తమదేవి నెడఁ
బాయఁజాలక యెట్లో వలనుగాక యిందిరా రాజశేఖరు
లనునావయందు ప్రయాణముచేయించిరి.

ఆ యోడ సకల సామగ్రులతోను పరివారములతో
నునిండి యుండెను. రాజశేఖరుఁడు కడు నెయ్యముతియ్య.

ముతో తన ప్రియురాలిని గౌరవించుటచే, ఆమె తన తలిదండ్రులను బాసినదుఃఖమునించుక మఱచియుండెను. ఒక్కనాఁడు పున్నమయగుటచే నాకాశమందు నక్షత్రములచే పరివేష్టింపబడియున్న పూర్ణచంద్రుని ప్రతిబింబము ఆనిర్మలోదకమునందు ప్రతిఫలింపఁగా అది రెండవ యాకాశమోయన నెంతయు నొప్పుచుండెను. ఆ రాత్రి యాబింబచంద్రునిఁ గాంచుచు, ఆవధూవరు లమితానంద పరవశులై వినోదక్రీడలచే తృప్తులైరి. మఱునాఁటి యుదయమున లేచి ప్రాతఃకాలపు క్రియలన్నియు నెఱవేర్చుకొని యిరువురు రెండు కిటికీల మూలమున చూచుచుండిరి. అపుడు వారి మనస్సునకు ఆనందము కూర్చుచు చుట్టు కనుపట్టుచుండెను. నదీతీరంబునం దంతయు పచ్చని పచ్చికపట్లపై చిత్రవర్ణపుష్పములు పడియుండుట చేత చూచుటకెంతయు సొంపు గూర్చుచుండెను. కొన్ని స్థలములయందు చక్రవాకములు నీరుకోయిలలు మొదలయిన వానితో ఉద్యానవనమునందు తామరకొలనో యనునట్లు వారికి శోభించుచుండెను.

అచ్చట చిన్నపల్లె యొకటి సమీపమునం దుండుటచే నాయూరికాంతలు కొందఱు జలకలశములను జంకఁబెట్టుకొనియు మఱికొందఱు స్నానముచేయుచును,వివిధ విషయములను చర్చించుచును,ఉన్నారు. కనుక మనము కొంచె మామాటలను ఆలకింతము. అప్పు డొకజవ్వని యింకొక్కతెను జూచి.

'ఈ వొడ్డాణము నీ వెప్పుడు చేయించు కొంటి'వని అడిగెను.

నాగమ్మ.—నేను నీవలె ప్రతిరోజున్ను నూతనముగా నగలు చేయించుకొనునంతటి భాగ్యశాలినిగా నమ్మా! ఇవి మాతాత గతించినప్పుడు నాకొసఁగి పోయెను. ఇప్పుడు సుమారు పదియేండ్లు అయిన'వని చెప్పెను.

మఱియొక్క వైపున కొందఱు వయస్సు చెల్లిన స్త్రీలు తాముకట్టుకొన్న బట్టను సగము విడఁదీసి దానిని ఉదికి వెనుక నడుముఁజుట్టుకొని తక్కినసగమును ఉతుకుకొనుచు నేమో గొణుగుకొనుచునుండిరి. ఇంకొక్క వైపున కొందఱుయువతులు స్నానము చేయుటకై ఇరుప్రక్కల చూపు నిగిడించి పురుషులెవ్వరు లేరాయని చూచి తటాలున నీటిలోనికి దిగి స్నానానంతర మతిగోప్యముగా క్షణకాలములో వస్త్రములనుధరించి తమపాలిటి యత్తలకై భయపడి నీరు శీఘ్రముగా పాత్రములయందు నిండించుకొని అతివేగముగా పోవుచుండిరి. ఇంకొక్క ప్రక్క ఒక్క బొక్కినోటిముసలిది మండూకముపగిది తలయెత్తుకొని యెవ్వరేని ముసలవ్వలు తన గోలవినుటకై రారా యని చూచుచుండెను. ఇంతలోనె ఒక్క పనిలేని పెద్దమ్మ యావృద్ధురాలిదగ్గఱఁగూర్చుండి 'అయ్యో! నీకుకోడలు ఉండియును నాకు లేకుండియు ఒకటియే. ఏమేనికొంచెము దాటికి వచ్చినదా? ఇంకను గబ్బులో ఉపవాసాలు ఇస్తుందా?' అనెను.

మొదటి వృద్ధురాలు—రెండవదానితో, 'ఉపవాసాలు-కావు, ఉపన్యాసాలు'

రెండవది,—ఏమియేమిటో! నానోరైన అట్టి అనాచారపు వాక్యములు పలుకవు.

మొదటిది—అవును. నేనంతా నీయాచార విషయం ఎఱుఁగుదును. మునుపటివలెనే ఇప్పటికిని ప్రొద్దున లేచి చారెఁడు పంచితమున్ను గ్రచ్చకాయంతగోమయమున్ను సేవిఁస్తున్నావా'.

రెండవది.—'లేదమ్మా! అది మొదటినాఁటినుండియె చాలి చుకొంటిని. ప్రొద్దున లేచి ఆవు వెనుకతట్టుకుపోయి పంచితము పట్టునప్పటికే అది వెనుక కాలిఁగ తన్నఁగా నానోటిపండ్లన్నియు ఊడిపోయెను. ఆనాఁటినుండి అపని చాలించుకొంటిని. నాయదృష్టమునకు తగినట్లే మోటుపశువు దొరకెను. దేనికిని ఇచ్చి పెట్టుకొనవలయు' నని కడువిచారముతో పలికెను. ఈ మాట విని మొదటిది యామె దుఃఖమును సగము తానుపంచుకొని 'అది యేమి విపరీతకాలమో నాకోడలికి పేఁడయన్న అసహ్యమఁట! వాళ్ల అన్నయ్య సీమకు వెళ్లినాఁడఁట! అదిచూచి ఇది పడిపోతున్నది! ఎప్పుడు వార్తాపత్రికలు చదువుట. కాఫీలఁట! టీయఁట! అదిగాక వీణవాయించుట! భోగమువాండ్లకన్న కనాకష్టపుఃనులు చేయుచున్నది. ఆ వెధవముండాకొడుకు పెండ్లాంఅంటే ప్రాణములు విడుస్తాఁడు.

చూచి చూచి నావాళ్లు మాటలు పుట్టినప్పుడు, ఒక్కనాటికి అడిగితినా ఇద్దరుచేరి ఈముసలిముండ లశో పడలేమని ఒక్కగదిలో పడియేడుస్తారు. ఈకాలములోనే ఇట్లువున్నది మాకాలంలో మొగుడితో చక్కగా మాట్లాడినా ఎఱుగము' అని యేమేమో చెప్పుచు ఆకాశము వంక తలయెత్తిచూచి ఇరువురు ముందుక కూర్మముల పగిది మెల్లమెల్లగా నడచి పోవుచుండిరి. మఱియొక్కవైపున, ఇంకొక్కతె సగము నీటిలో నిలిచి యాకాశమువంక చూచుచు నేమో చెప్పుకొనుచు యెవ్వరుచెప్పక యే చెంపలు కొట్టుకొను చుండెను

ఒక్కపొట్టిది సామిదేవమ్మనుచూచి 'మన వెంకమ్మ కోడల్ని మొగుడు తన తల్లిమాటవిని చావతన్నాడట'! అనునంతలో 'ఓసీ! ఓసీ! వాడు ముండ నుంచుకున్నాడటనుమా' అని మఱియొక్కతె అత్రముతో పలికెను. ఇంతలోనె పదునెనిమిది యేండ్ల ప్రాయముగల ఒక్క బక్కపలుచని చిన్నది కన్నులనిండ నీరుదెచ్చుకొని, 'అత్తగారుకలిగిన దోశల్ల ఇదియేగోడు! లోకమునందలి అత్తలందరూఒక్కసాగే'అనునంతలో ఇంకొక్కతె తటాలున ఆమెనోరిని అదిమిపట్టెను. పాప నూామె అత్త సమీాపమున నున్నదికాబోలు. ఇవ్విధముగా జలమునిమిత్తము వచ్చిన నారీజనముల సమావేశము ఆరాజదంపతులకు వినుట కెంతోవినోదము గూర్చుచుండెను.

ఇట్టి పలు తెఱంగులగు వినోదములను చూచుచు తమ
రాజ్యమునకు వారము రోజులకు చేరిరి. తోడనే ఇంది
రాదేవి తన అత్తమామలకు నమస్కరించి వారి దీవెనలను
బడసెను. కొలఁది కాలములోనె యాదేశమందు ఎన్న
రేని తప్పుత్రోవలనడచి నప్పుడెల్ల వారి పెద్దలు 'ఇందిరా
దేవినిచూచి యైనను బుద్ధి దెచ్చుకొనఁగూడదా' అని చెప్పు
నట్లు ఇందిర తనకీర్తి నాదేశమం దంతయు వ్యాపింపఁ
జేసినదయ్యెను. ఆరాజదంపతులు నిమిషమైనను ఒక్కరి
నొక్కరెడఁబాయఁజాలకుండిరి. ప్రతిదినమును ఉద్యాన
వనములకుఁబోయి అచ్చట స్ఫటికశిలానిర్మితమైన తామ
రకొలని సోపానములపై కూర్చుండియు, పూఁబొదరిండ్ల
యందు విహరించుచును, ఒక్కరి నొక్కరు పరిహసించి
నవ్వుకొనుచును, వినోదక్రీడలచే ఆనందించుచుండిరి.
ఒక్కనాఁడు ఇందిర తననాథుని సమీపమునఁ గూ
ర్చుండి మిక్కిలి యుల్లాసముతో ఏమో చెప్పుచుండెను.
రాజశేఖరున కెప్పుడును ఇందిరకు కోపము కలిగించుట
యొక వేడుక. అందుచే నతఁ డప్పుడు తన ప్రియు
రాలిని బిలిచి 'ఇందిరా? ఇఁక మీఁదట నా సమీపము
నకు రాకుము. నాతో మాటాడవలదు. నీ పితరుల మోహ
మునఁదగిలిన దానవు. చక్రవర్తి నిన్ను ప్రేమించినది లో
కవిదితమె కదా! అట్లు ఒక్కరు ప్రేమించిన పిదప నేను
ప్రేమించుట నాకు అంతగా ఇష్టముగాదు. నిన్నరాత్రి
అంతయు ఆలోచించియే నిట్లు పలికితిని' అని చెప్పెను.

ఇందిర కోపముతోఁ 'నాతో నింక మాఱుమాటాడవలదు' అని లేచి దూరమున నొక కుర్చీపై కూర్చుండి మొగము ముడుఁచుకొని యుండుటఁ గాంచి రాజశేఖరుఁ డామెకు నెఱుఁగకుండ వెనుక ప్రక్కను బోయి సువర్ణపాత్రమునందు ఉంపఁబడిన జలమును తన వ్రేలితో నద్దుకొని యామె కంటిపై విడిచెను. అప్పుడు ఇందిర పక్కున నవ్వి తిరిగి కోపము వచ్చినట్లు అభినయించి దుఃఖస్వరముతో 'మీరు నాజోలికి రావలదు. ఇంకొక్కసారి నా చక్రవర్తి ప్రశంస నాయెదుట పలికితిరా, నాప్రాణము తీసికొందును.'

రాజ.—ఇందిరా? నేనొక్కటి చెప్పెదను వినుము. తొలుత ప్రశ్ని చెప్పుము; లేక చెప్పియైన పిదప ప్రశ్నము. రెండుమాత్ర మొక్కసారిగా చేయరాదుసుమా' అనెను. ఈమాటవినుటచే ఇందిర నవ్వు నాపుకొనలేక లేచి త్వరగావచ్చి యాతనిబుగ్గల నులుముచు 'ఎక్కడ నేర్చుకొంటిరి ఇట్టి మాటలు?' అని యిరువురు నొడఁబాటునొందిరి.

## విపత్తు కలుగుట

ఆహా! ఎంతవారికైనను విధి తప్పునా? కష్టపడని మానవులుగలరే! కొలఁదిరోజులు వెన్నెలయు కొన్ని దినములు చీఁకటియుఁగదా! అట్లే మనుష్యులకు కష్టసుఖములు రెండును ప్రాప్తించుచున్నవి. ఒక్కనాఁడు ఇందిరారాజశేఖరులు నావయందు ప్రయాణము చేయుచుండఁగా

నాకాశమంతయు మేఘములచే నావరింపఁబడి గాఢాంధ
కారములో ప్రళయకాలమువలె వారికి తోఁచుచుండె
ను. అట్టిసమయమున వరుణదేవుఁడును వాయుదేవుఁడును
తమబలతారతమ్యములను పరిశీలింపఁ దొడఁగిరి. ఆసమ
యమున ఉఱుములును మెఱుములును పిడుగులును
గా మహాసమరము గలుగుచున్నదోయని వారికి
తోఁచెను. కాలముమించిపోవుటచే వారికి చేయునది
లేనందున నిశ్చలహృదయముతో దైవమును ప్రార్థింపఁ
దొడఁగిరి. కొంతకాలములోనే వారికి ఒక్క విధమైన
సంతోషమును ఊరటయుఁ గలిగెను. అది ఎద్దియన.—
ఇరువురికి నొక్కసారియె మరణకాలము ప్రాప్తించు
టచేత నొకరిదుఃఖము మఱొక్కరికి లేకపోవుటచే
సంతోషమును కొంతయూరటయును కలిగియుండెను. కొం
తసేపటికంతయు వారెక్కియుండు నావ తుత్తునియలై పగి
లెను. అందులకు కారణమేదో యొక్కశిలకు నది తగిలి
యుండవచ్చును. పాపము! వారేమిచేయుదురు! వారి
కప్పుడు కలిగినసంకటమును వ్రాయ శక్యముకాదు. రాజ
శేఖరునకు ఏదోయొక్కపలక యాధారమైయుండుటచేత
దానినిబట్టుకొని యతఁడెంతోకష్టముతో నొక్కదీవికి
పోయిచేరెను. పాప మాతఁ డెంత వెతకినను తనప్రియు
రాలిజాడ లేవియు కనఁబడకపోవుటచే నామె నదీప్రవా
హమునందు మునిఁగిపోయియుండునని నిశ్చయించుకొనె
ను. తిరిగి యతఁడు తనప్రియురాలిని కలసికొనుటకై నది

యుండు మునుఁగనెంచెను. కాని, యొక్కసమయ మిందిర
యెవ్వరిసహాయముచేతనైనను సజీవయై యుండినయెడల
నామెకు నెంతదుఃఖముగలుగనో యని తలఁచి 'నేనెన్ని
దుఃఖములకైనను ఓర్చుకొందును; కాని నాప్రియురాలిని
దుఃఖమున ముంచుటకు నోర్వలేను. దైవమా! ఇదే నే
ను సత్యముగా చెప్పుచున్నాను. నేఁటినుండి ఒకసంవత్స
రమువఱకు నాప్రియురాలిని వెదకుచు నేనెట్లో నాప్రా
ణములను అతిభారముగా వహించి యుండెదను.
నాభాగ్యవశమున ఇంతలో అది దొరకెనా నేను
ధన్యుఁడయ్యెద. లేనిచో ఏజలములఁబడి నాహృదయే
శ్వరి మరణించెనో ఆ యీప్రవాహమునఁబడియె నేనును
జచ్చెదను. ఇదిసత్యము. ముమ్మాటికి సత్య'మని ప్రతిజ్ఞచేసి
కొని పిచ్చివానివలె దేశదేశములు తిరుగుచు వెదకి వెదకి
వేసరుచుండెను. అతఁడు తనప్రియురాలు లేక తానొంటి
గా మగధదేశమగు తనరాజ్యమునకు పోవుటలేదని నిశ్చ
యించుకొనియుండెను. ఇది యిట్లుండనిమ్ము. పాపము!
అనాథయగు ఇందిర కెట్టిసంకటము కలిగెనో కొంత
విచారింతము. ఇందిర యాశిలాసమీపముననే యొక్క
ముండ్లపొదకుఁ దనవస్త్రము దగులుకొన్నందున ఇటు
నటు కదలలేకుండెను. 'నానాథుఁ డీజలమునందే తప్పక
మృతుఁడై యుండఁగలఁడు. లేకున్న నన్ను కావరాకుం
డునా?' యని యామె నిశ్చయించె. అందుచే నామె యెంత
మాత్రము తనప్రాణములపై నాశగొన్నది కాక పరమా

త్మనే ధ్యానము చేయుచుండెను. అప్పు డధికముగా గాలి
వీచుటచే నాకంప మెల్ల మెల్లన కదలుచు నొక్క దీవియం
దు చేరెను అప్పుడు ఇందిర తనలో 'నాప్రాణేశ్వరుఁడు
మరణించియే యుండును. లేకున్న నన్ను మాత్రము సుర
క్షితముగా నీదీవికి దైవము పంపియుండదు. ఆతఁడు బ్రతికి
యుండుటచేతనే నన్నును సజీవఁగాఁ జేసెను. ఆయన
మరణించియుండినఁ దప్పక నాకును మరణమే కలిగి
యుండును. అట్లు కాకున్న నేనేమి యపరాధము చేసి
తిని? నన్నేల ఆదైవము భర్తృవియోగముచే దహిం
చును. నేను నాయోపినంతవఱకు నానాథుని వెదకచూ
చెదను. అప్పటికిని నానాథునిపోబడి నాకొక్కటియు
తెలియకపోయెనా నె నగ్నిప్రవేశము గావించుకొనెద.
సచ్చరిత్రలగు స్త్రీల కందఱకు నిది యొక్కటియే ఉచ
రింపదగు ధర్మము' అని తలఁచి మెల్లన లేచి కొంతదూర
ము నడచెను. ఎప్పుడును సుకుమార సుఖములకే తగిన
దగుటచే నామె కీకష్టమును సహింప శక్యము గాద
య్యె గాన మూర్ఛిల్లి నేలంబడెను. కొంతసేపటికంతయు
నెవ్వఁడో యొక్క వృద్ధుఁడు దప్పిగొనుటచేతనో, లేక
కాలుసేతులు కడుగుకొనుటకో, యచ్చటికి వచ్చెను. అత
నికి నాయంసమయ మగుటచే చక్కఁగా కన్నులు కనఁ
బడలేదుగాని యతనికాలికి ఏదో యొక్క వస్తువు
తగిలెను. అది చల్లని నీటియందు చాలసేపు పడి
యుండెనని యతనికి తోఁచెను; కానియది యెట్టిదో యాత

నికి తెలియనందున చక్కఁగా చూచెను. అతఁడది యొక్క మనుష్యదేహమని తెలిసికొని తనలో 'పాప మే క్రూరాత్ములో ధనాపేక్షచే నీమెను చంపి యిచ్చట పాఱవైచి పోయియుందురు. అట్లొనరించియుండిన నీమె దేహమంతయు నీటిచేఁ దడియుటకు కారణమేమి? ఈమె నావయందు ప్రయాణము చేయునప్పుడు ఆనావమునుఁగుటచే నీటియందు మృతురాలై యుండవచ్చును. అట్లు చచ్చినది దీవికెట్లు చేరును? నేను మొదట తలఁచినట్లే జరిగియుండవచ్చును. కాని, యీమె మరణింపనందున నెట్లో దీవికివచ్చి చేరియుండును. ఆయాసముచేత ఇప్పుడీమె మూర్ఛితయై యుండును. పాపము! ఈమెకు నేనేమి సహాయము చేయుదును? కొంచె ముపచారము చేసి చూచెదఁ గాక. పిదప దైవమున్నది' అని తలఁచి 'ఓరీ! సేవకా! నేను ప్రయాణమునకై తెచ్చుకొన్న పాల నిటు తెమ్మని' పలికి యాక్షీరమును నొక్క చిన్నగుడ్డనుతడిపి యామెనోటియందు పిడిచెను. అతఁడు తనలో 'ఈమె సాక్షాత్కరించినలక్ష్మియో అన్నట్లున్నది. ఈమె కిట్టి యిడుములు కలిగించుటకు నాదైవమునకైన నెట్లు మనస్సువచ్చెను? అహా! ఈమెను గాంచినప్పటినుండియు నాకు పుత్రవాత్సల్యము కలుగుచున్నది. నే నిదివఱకు నెవ్వరికైనను ఉపకారము చేసియుండినయెడల దాని ఫలముగా నిప్పుడే యీమెను సజీవఁగానే చూచుట గలిగినఁ జాలును. ఓ! అనాథరక్షకా! ఈ అనాథబాలికను

రక్షింపుము. నమ్మినవారికి నభయమొసఁగు మహాప్రభూ! నేను నిన్ను సదానమ్మియున్నవాఁడను. కావున నీవీమెకు ప్రాణము లిమ్ము. నిన్ను నమ్మి యీ బాలికకు నుపచారములు చేసెద. నాకు తప్పక ఫలము సిద్ధించుఁగాక యని తలఁచుచు కొంచెము కొంచెము పాలను ఆమెనోట విడుచుచు వచ్చెను. ఆపాలు నామెకు గలిగియుండిన శోషను దీర్చివైచెను. కొంతసేపటికి కాంతయు నిందిర కను విచ్చిచూచి హీనస్వరముతో 'తండ్రి! మీరెవ్వరో నే నెఱుంగను! ఏల నాకు పరిచర్యలు చేసెదరు? మీ రుపకారముచేసియు నాయట్టి నిర్భాగ్యురాలి కది యపకారము చేసినట్లె అయ్యెను' అనెను. అపుడామెకన్నులు అశ్రుజలముచే నిండినవయ్యె. అదిచూచి యావృద్ధుఁడు విచారముతో 'తల్లీ! ఏల యిట్లు పలికెదవు? నీకేల యిట్టి యాపద సంభవించె? నీసంగతి అంతయు దాఁపక విశదీకరింపుము. నాశక్తికొలఁది నీకు సహాయుండనయ్యెద'ననెను.

ఇం—అయ్యా! నేను సింధుదేశపు రాజపుత్రిని. నాపేరు ఇందిర. నన్ను పదుమూఁడు మాసములక్రిందట మగధాధీశునిపుత్రుఁడగు రాజశేఖరుఁడు వివాహము చేసికొనియెను ఆనాఁటనుండి నిన్నటిరాత్రివఱకు మేమిరువురు నెడఁబాయకుంటిమి. ఆభక్తజనరంజనుం డగు సర్వేశ్వరునియెడల నపరాధుల మగుటచే మేమెక్కియుండిన నావ గాలివానలోఁ జిక్కి యొక్కపర్వతశిలకుఁ దాఁకొని శిథిలమయ్యెను. అట్టి అవస్థలో మే మొ

క్కడ నొక్క రెడఁ బాయవలసి వచ్చెను. నే నెట్లు గట్టునకు చేరితినో నాకు తెలియదు. నానాథుని యందుఁగల ప్రీతిచే నాశ్రమమయినను సరకుచేయక ప్రాణేశ్వరుని వెదకి వెదకి వేసరి తుదకు నడువలేక యిట్లు పడితిని. మీరు నాయందు కరుణకలిగి నాకు పరిచర్యలు చేయుటచేత నేను' అనునంతలో 'నావృద్ధుఁడు 'అమ్మా! మాటలుండనిమ్ము. నీవు కడుబడలియున్నావు. త్వరగా నాయింటికి రమ్ము. ఈ తడిసిన పుట్టముతో నుండరాదు. శీఘ్రముగా నీబండి నెక్కుము. భోజనమయినతర్వాత నంతయు ఆలోచించెద'మనెను.

ఇం.—'తండ్రీ! నానాథుని సంగతి తెలియునంతవఱకు నే నొక్కచోట నిలుచుదాననుగాను. నన్ను క్షమింపుము.

వృ.—నీవు రాచపట్టివగుటచే నాయట్టి బీదవానియింట వసియించుట యనుచితమని తలఁచెదవు కాఁబోలు?

ఇం.—అట్లు తలఁప వలదు. నావంటి నిర్భాగ్యురాలు తమ యింటియందు నుండఁగూడదనియు, నానాథుఁడు ఎచ్చట నున్నాఁడో యెంత కష్టములు పడుచున్నాఁడో నేనుమాత్రము తమచెంత సుఖముగానుండరాదనియు చెప్పితినిగాని మఱివేఱుకాదు.

వృ.—అయిన నాగృహమునకు వచ్చుటకు నీకు అభ్యంతరము లేనట్లు తెలిసెను. నాకొక్క పుత్రిక కలదు.

నిన్నును నాతెనూజఁగా నెంచెద. నీపతివిషయమై నేనంతయు విచారించెద.

ఇం.—అతఁడు ఉపకారము చేసినవాఁడగుటచే ఆతని మాటకు అడ్డుచెప్పలేక 'తండ్రీ! నేను మీ యాజ్ఞను శిరసా వహించెద' నని పలికి యాతనివెంట నింటికి పోవుచుండెను.

## మదనగోపాలుగారియిల్లు.

తారాభాయి 'సుందరీ! వాకిట నేదోయొక్క శకట చక్రములధ్వని వినిపించుచున్నది. అప్పకొఱకే ఎవ్వరో వచ్చియుందురు. మానాన్నగారు కమలాపురమునకు వెళ్లియున్నారు. రేపుఉదయము వచ్చెదరని చెప్పు'మనెను. సుందరి వాకిటచేరునంతలో ఆత్రముతో 'అమ్మా! నాన్నగారేవచ్చారు' అని కేక వినవచ్చెను. తారాభాయి గరిట చేత నిడుకొని 'రేపు వచ్చెదనని నేఁడు వచ్చుటకు కారణమేమి? దేహస్థితిబాగులేదు కాఁబోలు' అనుచు వీధి గుమ్మము సమీపమున నిలిచియుండెను. ఇంతలో మదనగోపాలుగారు మెదటదిగి 'సుందరీ! నీవు ఆడుకొనుటకు నేనొక్కటి తెచ్చియున్నాను. చూచి ఆనందింతువు గాక' యనుచు 'అమ్మా! ఏల సంకోచ పడెదవు. ఇచ్చట నుండువారందఱు మనవారే. నా యీచిన్నగృహమును పావనముచేయుము. దిగుము' అనుచుండుటఁ గాంచి తారాభాయి గుండె జల్లుమనెను. ఆమె 'ఈతఁ డెవ్వతినో యొక్కకన్నెను వెంటఁబెట్టుకొని వచ్చినట్లు తోఁచు

చున్నది. ఎవ్వరై యుండనచ్చును' 'యని శంకచేత నేక
దృష్టితో నాబండి నే చూచుచుండెను. కొంతసేపటికంత
యు నొక్క సౌందర్యవతిని గాంచెను. ఆమెనుగాంచి
నప్పుడు తారమదికి సాక్షాల్లక్ష్మీదేవియే యట్లుమూర్తీభ
వించెనా యని తోఁచెను. ఆమె దేహము కడుబడలియుం
డెను. ఆమె చింతాక్రాంతురాలై యున్నదని తోఁచెను.
అందుచేతనేమో కాని సుందరీ తారాభాయులకు నామె
యెడలవ్యాజకరుణయు, ప్రీతియు, సంతోషమును ఒక్క
మారేకలిగెను ఇందిర యొక్కనాఁడైనను ఇతరులగృహ
మునకు పోయి యెఱుఁగదు. ఎప్పుడును ఆమెదర్శన
ముకొఱకే అందఱును వచ్చుచుందురు. కాన యిప్పు డి
తరులయింటికి పోవుటచే నామెకు మిక్కిలి లజ్జగానుం
డెను. ఆబిడ మెల్లగా నాబండిని దిగి యాగృహిణి యడు
గులపైఁబడి నమస్కరించెను. ఆవృద్ధురాలు 'దీర్ఘసు
మంగలీభవ' యని దీవించెను. ఆపలుకులు ఇందిరమదికి
ఆహ్లాదమును గూర్చెను. ఇంతలో మదనగోపాలు గారి
భార్యను జూచి మనపూర్వజన్మ పుణ్యఫలముచే నాదైవ
ము శ్రీలక్ష్మీ దేవినే మనగృహమును పావనము చేయు
టకై పంపియున్నది. ఈమె మిక్కిలి అలసియున్నది శీఘ్ర
ముగాపోయి అన్నపానాదుల నీమెకుసిద్ధపఱుపుము' అను
చు అందఱును లోనికిపోయిరి. ఇందిరను ఒక్కగదిలోఁ
గూర్చుండఁజేసి 'అమ్మా'నీవస్త్రమంతయుతడిసియున్నది
శీఘ్రముగా స్నానమాచరించి మఱియొక్క వస్త్రము

ధరింపుము. లేకున్న జబ్బుచేయును జుమా. ఎందుచేత నీచీరయంతయు తడిసియున్నది? నీచరిత్ర మొక్కటియు నాకు తెలియకున్నది' అనునంతలో మదనగోపాలుగారు 'తారా! ఆబిడనొక్కటియు నడుగకుమా. అంతయు నాయీపాపపు నోటిచేతనే వినిపించెద' నని ఇందిరతనకు చెప్పినసంగతులను, ఆమె తనకు దొరకిన విధమును, సకల వృత్తాంతమును తెలియఁజెప్పెను. అప్పుడు తారాభాయి కన్నీరు తుడుచుకొనుచు 'ఎంతటివారికైనను విధితప్పదు. ఆలనాఁడు ఆచంద్రమతీ దమయంతులకు కష్టములుదప్పినవా?' అని ఇందిరనుచూచి 'అమ్మా! నీవుమాబిడ్డవు. నీకు దైవము శుభముకలిగించునుగాక! దుఃఖింపకుము. మా సుందరి యెట్లో నీవునట్టే' అనుచు అధికమైన యాదరణతో ఆమెను చూచుకొనుచుండెను. సుందరి మంచిబుద్ధి కలిగినది. ఆమెకుతగినట్లు మంచి మనస్సుకూడ నన్నెదెచ్చుచుండెను. ఇందిరాదేవికి కలిగిన దుఃఖము నామెసగము పంచుకొనెను. ఆనాఁటిసాయంసమయములోనే ఇందిరా సుందరులకు మిక్కిలి స్నేహము కలిగెను. వారిరువురు నొకరినొకరు సోదరీభావముననె చూచుకొనుచుండిరి. ఒక్కనాఁడు తారాభాయి మదనగోపాలుగారు నిరువురును ఇందిరను జూచి 'తల్లీ! నీ వెంతకాలమైనను బుట్టిలాగున నుండిన ఏమిలాభము. నీదేహకాంతియు దినదినమునకు తగ్గుచున్నది. ధైర్యము మాత్రము కలిగియున్న నెట్టికార్యమైనను సాధింపవచ్చును. నేను నీపతి

విషయమై నలు దిక్కులకు పరిచారకుల నంపియున్నాను. నీవు అధైర్యపడకుము. శీఘ్రకాలములోనే నీప్రియు నిక్షేమవార్త వినఁగలుగుదువు. ఊరడిల్లు' మని చెప్పెను. ఇందిరబదులేమి పలుకఁజాలక యూరక కన్నీరువిడుచుచుండెను. ప్రతిదినము రాత్రులందు తారాభాయి ఇందిరగదిలోనె పరుండును. మదనగోపాలుగారికి సుందరియొకతేపుత్రి యవుటచే అల్లుని సహితము తమయింటిలోనే యుంచుకొనియుండిరి. ఒక్కనాఁడుసుందరిభర్తయగు నాగరాజు వ్యాపారార్థము ఇతరదేశమునకు పోయియుండెను. ఆనాఁడు సుందరి బలవంతపఱుచుటచేత ఇందిరయు ఆమెశయన గృహమునందే పండుకొనెను. అప్పుడు సుందరి యిందిరనుజూచి చెలీ!నీవెంత కాలమైనను ఇట్లు దుఃఖించుట సరికాదు. కాలమెవ్వరికిని తప్పదు. నీవుధైర్యము తోనుండుము. నాన్నగారు ఇదివఱకే నీకుచెప్పియుండలేదా! నలుదిశలకు మనుష్యులను పంపినట్లు. ఒక్కరు కాకున్నను మఱొక్కరు నీప్రాణేశ్వరుని వృత్తాంతము నెఱుఁగఁగల' రని యింక నెన్నోయూరడింపు మాటలు చెప్పుచు 'అవును, అందఱు ఇతరులకు చెప్పువారే. వారి వారికివచ్చినప్పుడు భరింప నశక్యము. మావారునాయొద్ద సెలవు పుచ్చుకొనియే, నాకు తెలిసినచోటికే, వెళ్లియున్నారుగా! ఏటికో నామనసుకుదురుపడలేదు. స్నానపానాదులయందును ఇచ్ఛలేకయున్నది. ఇంక నీసంగతియా! అబ్బా! చెప్పశక్యముగాదు. నేనే యిట్లుండినచో తక్షణ

మేనా ప్రాణములను తీసికొనియుండును. నీవు ఆయనరూపమును ధ్వనిని చక్కఁగా గుర్తింపఁగలుదువుగదా.'

ఇం.—'ఒక్కరూపము మాత్రమే కాదు. మేము ఆనాఁడు ఉద్యానవనమునందు విహరించునప్పుడు ఎంతగా ఒకరి నొకరు పరిహాసించుకొనుచు మాటిమాటికి నెన్ని ముద్దులు పెట్టుకొంటిమో అవి యిప్పటికిని నాకు మఱువునరురావు. వేయేల? సదా నామనః పీఠమునందు నెలకొనియున్న యతని రూపమును నే మఱచునెట్లు?' అనుచు కన్నీటిచే సుందరి యంకపాళి యందుండిన ఇందిర దుఃఖమును ఆపుకొనలేక లేచి కూర్చుండెను.

సుం.—'చెలీ! నీవిట్లు దుఃఖించిన నేను నీచెంత నొక్క నిమిషమైన ఉండఁజాలను. మన యిరువురికి అచిర కాల పరిచయమై యుండియునది సహస్రయుగకలిత మునలె ప్రకాశించుచున్నది. కాన నీదుఃఖమును నేను నిమిషమైనను జూడఁజాలనని పలికెను.

సాధారణముగా నెవ్వరికైనను దుఃఖము కలిగినప్పుడు వారితరుల దుఃఖమును చూడఁజాలరు. వేఱు సంతోషమును వారిమనస్సునకు రుచింపదు ఇప్పుడో సందరీభాయి తనపతి నెడఁబాపిన దుఃఖమును ఇందిరావియోగము వృద్ధిచేసిన దాయెను.

సుందరి ఇందిరనుజూచి 'చెలీ! ఒక్కసమయము నీపతి యిపుడేవచ్చి నిన్ను తనరాజ్యమునకుఁ దోడుకొనిపోయిన

నన్ను మఱతువేమో! నీవు రాణివాసమునం దుండునప్పు
డు నేను నీయంతఃపురమునకు వచ్చిన రావలదందువా?'

ఇం.—'అక్కా! దైవానుగ్రహముచే అట్లే నానాథుఁడు
నన్ను తోడుకొని పోయినప్పుడు నీవువచ్చిన నేనెట్లు
ఆదరింతునో నీవే యెఱుఁగఁగలవు. ఊరకయిప్పుడు
నేనుచెప్పిన నేమిఫలము?' అని కొంతసేపు ఇందిర
నిక్కముగానే తనయంతఃపురమునందు తన ప్రాణే
శ్వరునితోఁ గూడియుండినట్లును అప్పుడు సుందరి
తన్నుఁ జూడవచ్చినట్లును భావించెను. వెంటనే సుందరి
కంఠమును ప్రీతిపూర్వకముగా కౌఁగిలించుకొనెను.

సుందరి—'చెలీ! నీకేమి మతివిభ్రమమా! ఏల నిష్కారణ
ముగా నన్నుఁ గౌఁగిలించుకొంటివి? నీచందముచూడ
నిక్కముగా నీకు పిచ్చిపట్టినట్లే తోఁచుచున్నది. నాకు
భయమగుచున్నది. చెలీ! నిక్కముగా నచించెదను
నీకు చీమకుట్టిన ట్లైన మేమునుఁగినట్లు నేనెంచుదాన
ను' అనుచు (గడియారమువంకఁ జూచి) 'ఆహా! ఎంత
ప్రొద్దాయెను. మాటలసందడిని ప్రొద్దుదెలిసికొనక
పోయితిమి ఇంక నిద్రింపుము. లేకున్న నీకు జబ్బు
చేయును. నాకును నిద్రపట్టుచున్నది' అప్పటికి శీఘ్ర
ముగా సుందరిమాత్రము నిద్రించినదయ్యె. ఇంద
రకు సుందరి యట్లు తనప్రియుఁడు రేపోమాపో
రాగలఁ డనుధైర్యము లేనందున నామెకు నంత
త్వరలో నిద్రపట్టదయ్యె. కొంతకాలము అటు నిటు

కదలుచు నేమో ఆలోచించుచు తుదకు నిద్రా దేవికి వశగతురాలయ్యెను. మఱునాఁటియుదయము న నాగరాజువచ్చెను. అందుచే ఇందిర నాఁటిదినము తన వాడుకగదిలోనే పండుకొనియె. ఏమికారణము చేతనో యారాత్రి తారాభాయి ఇందిరగదిలో పరుం డుటకు వీలు లేకపోయెను. ఇందిర వాడుక నొప్పున గదిలోనికిపోయి లోపలగొళ్లెమును తగి లించెను. ప్రొద్దున వాడుకచొప్పున సుందరీభాయి లేచి దంతశుద్ధిమొదలైనవి కావించుకొని ఇందిర నిద్రించుగదిదగ్గఱ వచ్చి చూచునప్పటికి తలుపు లిం కను మూసి యుండుటనుజూచి యుల్లసితలఁచెను. 'పాపము! ఇందిరకు రాత్రి చక్కఁగా నిద్రపట్టలేదు కాఁబోలు. అందుచేతనే నేఁడు ఆమె లేచుటకు ఆలస్య మయ్యెను' అని తలఁచి చాలసేపు అట్లే యెంచి యుండెను. ఎండ మిక్కుటముగా నుండుటచే 'ఇంక నిద్రించిన శిరోవేదన తప్పక కలుగును. లేపిచూచెదఁ గాక'యని 'చెలీ! ఇందిరా! మేలుకొనుము. ప్రొద్దు చాలఁ గడచెను. నీ వింతవఱకు నెన్నఁడు నంతసేపు నిదురించినది లేదు. నీకు దేహస్థితి బాగుగనున్నదా' యనుచు తలుపుతట్టెను. ఆశూన్యగృహమునందు ఎవరు బదులు చెప్పువారు? కొంతసేపటికి సుందరి తోఁటలోని తలుపు దగ్గఱ పోయిచూడఁగా నది తెఱ వఁబడియుండెను. లోనికిపోయి చూచునప్పటికి అచ్చ

ట నెవరును లేరు. సుందరి హృదయము తటతట కొట్టుకొనసాగెను. ఇందిర శయనించుమంచమును ఆమె చక్కఁగాఁజూచెను. తలగడ యంతయు కన్నీటి చే తడిసియుండెను. ఆపాన్పుపై నొకజాబు ఉంపఁబడి యుండెను. ఆలేఖను ఇందిరతనకే వ్రాసియుండునని యామె తెలిసికొనియె. కాని దానిని విప్పిచూచుటకు ఆమెచేతులాడకుండెను. చదువుటకు నోరు తడఁబడు చుండెను. చూచుటకు కన్నీరు ఆటంకపఱచుచుండెను. ఆ యుత్తరమునందిట్లు వ్రాయంబడియుండెను.

"ఓప్రాణసమానురాలైనసోదరీ! నేఁటికి నీచెంత సెల వు పుచ్చుకొనుచున్నాను. నిన్నటిమాట లేమనయిరువురకి కడమాటలు. నిన్నటిచూపే కడచూపయ్యెను. నేను ని చ్చటనుండి యెచ్చటికిపోవుచున్నానో, ఏమిచేయ నెంచి యున్నానో, నాకు నొకటియును తెలియదు. నాకు మీ చెంతనున్నను దుఃఖమే; లేకయున్నను దుఃఖమే. నాకీ ప్రపంచములో నెందున్నను దుఃఖముతప్ప మఱివేఱులే దు. ఈనిర్భాగ్యురాలికారణముగా మీకందఱికి కలిగిన దుఃఖము ఇంక మీకు లేకుండఁజేయవలయునని యే నా యిష్టము. ఆహా! నాకు దైవము సకలబంధువియోగ ము కలిగించెను. ఏటికీమొండిప్రాణము మాత్రము నాకు దైవ మొసఁగెనో తెలియకున్నది. అకటా! నేను పుట్టినయింటికిని, వొచ్చినయింటికిని, తుదకువచ్చినయింటి కిని, దుఃఖమేకలిగెను. నేనుమీయింటిదగ్గఱ సెలవుతీసి

కొనియే పోవలసినది. అట్లు చేసినను మీరంగీకరింపరని తె
లిసియే నేను మీతో చెప్పక వెళ్లనెంచితిని. ఆహా!
తల్లిగారికిని తండ్రిగారికిని ఎట్లు చెప్పఁగలవ్రా! నామీఁద
వారికి కోపము రాకుండ నాహృదయపూర్వకమగు నమ
స్కారములు వారిపాదములకడ సమర్పించునది నీభారము.
నామనస్సునందు సదా మీయందతిమెండఁగల ప్రేమ
నన్ను విడనాడు ననికాదు. మీకును నాయందు అట్లె
ప్రేమయుండుఁగాక —ఇంకను నేమో వ్రాయవలయునని
నామనస్సు ఊరక పురికొలుపుచున్నది; కాని నాకన్నులు
మాత్ర మందులకు సమ్మతించినవికావు. కన్నీటిచే నాకు
అక్షరములె కనఁబడకున్నవి. ఇఁక ఈజన్మమునందు ఇది
యేకడపటిసెలవుగాఁగైకొనుచున్నాను. నన్ను వెదకునిమి
త్తము మీరెవ్వరు శ్రమపడవలదు. నేనింక జీవించియుం
డను. అట్టు లోకసమయము కార్యార్థము ప్రాణము లుం
చుకొనవలసివచ్చినను నన్ను నెవరు గుర్తింపకుండునట్లె
యుండవలసివచ్చును. ఈలాగున వ్రాసితినని కోపపడవలదు.
సోదరీ! నన్ను మఱవవద్దు. కాదు, మఱచిపొమ్ము.
లేకున్న నీకుదుఃఖము. నాయనగారికి ఒకవినయపూర్వక
మగు ఉత్తరము వ్రాయనెంచితినిగాని చేతులు తడఁబడు
చున్నవి. కన్నులు కానరాకున్నవి, ఏమిచేయుదానను. ఈ
యుత్తరము వ్రాయుటకు మున్ను నిన్నొకసారిచూచిపోవ
లయునని యెంచితిని; కాని, భార్యాభర్తలుండుచోటికిఁబో
రాదని యాయుద్దేశము మాన్పుకొంటిని. ఇఁక నేవ్రాయఁ

జాలను. ఇదే నీకు నమస్కరించుచున్నాను. శీఘ్రముగా నాకంతము కలుగునటులు ఆశీర్వదింపుము'

ఇట్లు,
ఇందిర
నీప్రియసోదరి.

సుందరి యాజాబుచూచి యిట్లు దుఃఖించె 'ఆహా! నేఁడెట్టి దుర్దినము. నేనింక నెందు నాసోదరిని వెదకుదానను? ఇందిరాదేవి! నీకు మమ్మువిడిచి పోవమనస్సెట్లు కలిగెను? మేమేమి యపరాధము చేసితిమని మమ్ము త్యజించి పోయితివి? నిన్ను విడిచి నేనిచ్చట నొక నిమిషమైన నుండఁజాలను నాకు నింక నీ గృహము నెచ్చటఁ జూచినను శూన్యముగానే తోఁపగలదు. నీ చిలుక పలుకులవంటి పలుకుల తిరిగి నే నెన్నఁడు వినఁగల్గుదానను? ఒక్కవేళ నవ్వులాటకు నిట్లు వ్రాసి యెందైనను దాఁగియుండునా! ఆహా! అట్లు చేయుటకు ఆమెకు సంతోషమెక్కడిది? ఏంకి కీకన్నీరు కారెను? నిక్కముగా నన్నొడఁబాసిపోయెను. ఏమి చేయుదాన' నని మిక్కిలి దుఃఖించుచు ఈవృత్తాంతము తన తల్లిదండ్రులకు తెలుపఁగా వారు సుందరివలెనే దుఃఖించిరి; కాని, యేమిచేయఁగలరు? ఇది యిట్లుండనిచ్చి మనయిందిరగతి యేమాయెనో చూతము.

ఇందిరారాజశేఖరులు నదీప్రవాహమునందు మునిఁగిన సంగతి సర్వదేశములయందును వ్యాపించి

యుండెను. ఎన్నిదినములుగనో గోడమీఁది పిల్లివలె పొంచియుండిన చక్రవర్తికి నిపుడు సమయము దొరకెను. తాను వరించిన కాంతను వివాహమాడుటచేత రాజశేఖరుని రాజ్యముపై దండెత్తవలయు నని చక్రవర్తి తలఁచి యుండెను. కాని రాజశేఖరుని ధైర్య పరాక్రమములను తాను చక్కఁగా నెఱింగి యుండుటచే అతని కోరిక ఫలింపక పోయెను. ఇపుడు పుత్రివియోగముచే నా రాజశేఖరుని తల్లిదండ్రులు ప్రాణమునే అతిభారముగాఁ జూచుకొనుచున్నారు. ఇంక రాజ్యము నెక్కడ పాలింపఁగలరు? ఏక సింధుసింహము పైని దుముకునాయను సంశయమును లేదు. లోకవిఖ్యాతయగు పుత్రికారత్నమును గోల్పోయిన పిదప రాజ్యముపై నింక ఆశయెక్కడిది? వీరువుపు పుత్రపుత్రికామోహములు మునిఁగి కాటికి కాలుచాఁచుకొని యున్నారనుసంగతి చక్రవర్తికి స్థిరముగా తెలిసి యుండుటచే యుద్ధప్రయత్నములఁ గావింప నెంచి సభఁగూర్చెను. ఆసభలో రుద్రభట్టు, చంద్రాంకుఁడు, సత్యకీర్తి, సుదేవుఁడు, అను నలువురు మంత్రులు తమ తమయభిప్రాయములను జెప్పఁదొడఁగిరి.

రుద్రభట్టు తనగర్వములైన మీసములను సవరించుకొనుచు నిట్లుపలికె. రాజకంఠీరవ! నా మేనప్రాణములుండునంతకు నీ శత్రువుల పేరు లేకుండఁ జేయువాఁడ; అట్టినీబంటు నేనుండఁగా నీ కేలయీ ఆలోచన? ఒక్కమాట సెలవొసంగిన తక్షణమే వారినందఱిని యమపురికి నంపువాఁ

డను. కనుక నేనిప్పుడు పోయి నామగధదేశము నంతయు నిర్మూలము గావించివచ్చెద. నిష్కారణముగా నాయూరిపై దండెత్తుట ధర్మయుక్తముగాదని జనులు వదరెదరంచు సంశయము నీకువలదు. నిన్నుఁ గాదని తానిందిరను పెండ్లియాడుటయే యారాజశేఖరునియందు గొప్ప యపరాధము. ఆకారణముననే యీసమర మని నేనుశీవెద. ఎట్లయినను వానిక్రొవ్వణఁచుటయే సరి. ఇంతకన్న నేనేమి యభిప్రాయ మీయఁగలను' అని చెప్పెను. చక్రవర్తి తలయూఁచుచు 'సెబాసు' అనెను.

చంద్రాంకుఁడు. —— ప్రభూ! నీవుతలఁచిన కార్యము. ఎన్నఁడైనను వ్యర్థమాయెనా? బ్రహ్మతలఁచినచో ఆయుష్యునకేమికొఱత? బుద్ధియందు బృహస్పతిని మించిన వాఁడవు. అట్టి నీవు నితరుల యాలోచనలు గాని యేలకావలయును? అవశ్యము యుద్ధమునకు ఆయత్తము కావలెను. ఇదియే నాయభిప్రాయము

చక్ర—నీవు చెప్పినది సత్యము

సత్యకీర్తి.—మహాప్రభూ! సకలవిషయముల నెఱింగిన మీకు నేను తెలుపువాఁడనా! అయినను సేవకునియందుఁ గల యాదరణముచే మీరు నన్నడుగుచున్నారు. అడిగిన ప్రశ్నమునకు నుత్తర మియ్యకుండుట సేవకధర్మమునకు వెలితి. కావున విన్నవించెదను. ఈ సేవకునియందు కోపగింపక యాలకింతురుగాక. ఆమగధాధీశుఁడు పుత్రవియోగముచే కుందుచున్నాఁడని.

మనమోడిపోఁగూడదుము ; కాని, ఇప్పు డతఁడు మనకు సరి యైన సమరి మొనఁగాఁడు కాఁడు. అట్టివానితోడ మన కేమి పని! ఈయోచన కొన్ని దినములకు మున్నుండిన సరే. అప్పుడో రాజశేఖరునితో సరిగా సమరసంగ్రామమున హోరాహోరిగా పోరాడి జయము గాంచినట్లైయున మనకీర్తికి సాటిలేకుండును. ఇప్పుడో నీయట్టి వీరుఁడు రాజాధిరాజులకు రాజై సార్వభౌముఁడైన వాఁడు, ఒక్క నిరపరాధిపై - అందును - దుఃఖసముద్రమున సంపూర్ణముగా మునిఁగి ముకుఁడైయున్న వానిపై, దండెత్తినచో పిచ్చుకపై బ్రహ్మాస్త్రము ప్రయోగించినట్లాయెను. ఇంతేకాక మున్ను మనయభిప్రాయము తెలిపినందులకు ప్రత్యుత్తరమేమివచ్చెను ? నాకుఁ జూడ నతఁడు యుద్ధమునకు సమ్మతింపఁడు. అట్టివానిపై మనమైకయ్యమునకు కాలు ద్రవ్విపోరాదు. అట్లుపోయిన మనకు తప్పక జయము సిద్ధించును గాని కీర్తిమాత్రము నశించు ననుటకు సందేహము లేదు. దేవరవారికి నేను జెప్పినది రుచింపదని తెలిసినను నా యభిప్రాయము మనఃపూర్వకముగా నెఱింగించితిని. నాయందు తప్పున్న క్షమింప వేఁడువాఁడను.'

సుదేవుఁడు—ధరణీశా ! నాకు ఈసత్యకీర్తి పలుకొక్కటియు రుచింపదు. ఈనేఁడు నీకు సమానులైనవారితోఁగదా యుద్ధముచేయుమనెను అది యెన్నటికిని గానిపని. పలనిన— ఈధరణిపై నీకు సమానులెవ్వ

రున్నారు ? ఈతనిమది ననుసరించునట్లయినచో నింక మనము యుద్ధమునందు ఆశవిడువవలయు. ఈతేఁడు వృద్ధుఁడగుటచే ఇతనికి చిత్తచాంచల్య మధికమైయు న్నది. ఇట్టివాని యభిప్రాయము నడుగుట అనవస రము. కనుక దేవర యుద్ధప్రయత్నములు గావించుట యె యుచితము.

చక్ర.—'ఓమంత్రిసత్తములారా! మీయందఱియభి ప్రాయములు వింటిని. ఇందులో సత్యకీర్తి తప్ప తక్కిన వార లందఱిమతులును ఏకీభవించి యుండుటచే అదియే చేయవలసివచ్చెను. కనుక, రేపే యుద్ధప్రయత్నము గావింప వలెను. పంచమీతిథినాఁటికి మగధదేశమున కోట ముట్టడివేయవలెను. శీఘ్రముగా మీమీజను లతో ఆయత్తులుకండు. దినములు పెక్కు లేవు.'

అని తగుకీతిగా యుద్ధమునకు ఆయాపనులయందు ఆటితేటిన వారిని నియోగించెను. ఇది యిట్లుండఁగా అయ్యో! ఆయిందిర నడచినడచి నడువలేక దట్టమైన యొక్క యరణ్యముచేరి కూర్చుండెను. ఆవనముచూ చుట కెంతయుభయముగా నుండెను; ఆ యడవియందుఁ గల గొప్పవృక్షములక్రింద సర్పములు వసియించునట్టి పు ట్టలు రెండవపాతాళలోకమువలె కనుపట్టుచుండెను ఆ వృక్షశాఖలు విశాలముగా నుండుటచే పెనుమబ్బుక్రమ్మె నోయని తోఁచుచుండెను. క్రమక్రమముగా చీకటిక్రమ్మఁ జొచ్చెను. ఇట్టి కాళరాత్రియందు చిక్కియున్నది యొక

రాజవనిత; అందును సుకుమారి! అట్టిచోట ఆపరమసా ధ్వీమతల్లినిచూచిన నెట్టి రాకటికి గుండెయైనను కరఁగక మానఁగలదే? అయ్యో! ఈమెయే ఒకనాఁడు ఇట్టిరాత్రి యందు తన యంతఃపురమున తనప్రియుని సాన్నిధ్యమున సుఖనిద్రపోవుచుండఁగా ఖడ్గశూలాదిపాణులైన రక్షక భటులు పహరాయిచ్చుచు నొక్కరినొకరు హెచ్చరికలు చెప్పుకొనుచుండిరి. ఆహా! విధినిదప్పఁ దరమే యెవ్వరికైనను? ఆమె చేయునది లేక భయమువీడి ధైర్యమునుబూనియుండెను. చావ నుద్యుక్తులైయున్న వారికి భయ మెక్కడిది? ఆబిడ తనలోఁదా నిట్లు దుఃఖించెను. 'ఆహా! ప్రాణప్రియా! నేనేమియపరాధము నొనరించితినని నన్నెడఁబాసిపోయితివి? నిన్ను నేనెందు వెదకుదును? ఇదిగదా నీవు నన్ను కాచుటకు సమయము. హా దైవమా! కరుణానిధియని నీపేరు వాసిగాంచియుండియు నాయందు నీకరుణయంతయు నెచ్చటపోయెను. ఇట్టి ఘోరారణ్యమునందు ఏదైనను ఒకమృగము నన్ను మ్రింగఁగలదనెడియాశగూడ లేకపోవుచున్నదికదా. ఏమిచేయఁగలను. ఆహా! ఏమియిది! ఇట్టి కారడవియందుఁగూడ జననివాసముగలుగునా? అట్లుండకపోయినను నావంటి నిర్భాగ్యు లెవ్వరైన నుండవచ్చును. లేక క్రూరహృదయులగుచోరులైన నుండవచ్చును.ఎవ్వరైననేమి? ఇచ్చటనుండి ఇంక నొక్కయడుగైనను పెట్టుటకు నాకు శక్తి లేదు. ఆ యనాధరక్షకుఁడే నన్ను రక్షించువాఁ డని చింతించుచుండెను.

దూరమునుండి కొందఱు 'ఓరీ! నేఁటిదినము తప్పించుకొంటిమి. ఎంతసొత్తు ఎంతసొత్తురా!'

మఱియొకఁడు.—నాకు దీనిలో మూఁడువంతులు చేరవలెను. నేనే యెక్కువగా కష్టపడితిని.

ఇంకొకఁడు.—ఓరీ! నీకొంపకూల. నేనేకదఁటరా ఆపెద గోడదూకింది. వట్టి ఆడంబాలుగపితే ఏమిప్రయోజనం? మనమందరం లేకుంటే ఈపని శాంతం; నెరవేరియుండదు.

ఇట్లు పలుతెలుంగులగు మోటుసంభాషణలు ఇందిరాకర్ణము నాకర్ణించుటచే ఆమెకు ఏమిచేయుటకు తోఁపక యిట్లు తలఁచెను. వీరిమాటలవలన వీరెవ్వరైనది నేను తెలిసికొంటిని. వీరు వట్టిధనాపేక్షకులుమాత్రమేయైనచో నన్ని వనదేవతకు ఈరాత్రియే తప్పక బలియియ్యఁగలరు. అందుకు చింతింపనుగాని నీచహృదయములతో నన్నేమైన బాధింతురేమో అను భీతిమాత్రము నాకు కలుగుచున్నది. వారు సమీపమునకే వచ్చిరి. ఇఁక నిచ్చోటనుండి కదలుటకు వీలులేదు. ఇచ్చటనే యుండుఁగాక. ఆదైవమే నాకుతోడుపడఁగల'దని తలఁచి కూర్చుండియే యుండెను.

మల్లన్న.—ఓరీ! భయపడకుము. ఆచెట్లచాటున దయ్యం కూర్చునియుంది. చుట్టుతగి లేస్తే అది మనచెంతకు రాదు.

మఱొకఁడు—కాదురా! ఓరేపాపిష్టి! ఇదివనదేవతయే అయివుండాలె. వెయ్యానికి ఇట్టిచక్కఁదనం ఏంటిరా.

ఇంకొకఁడు—అది దయ్యమైతేనేమి? దేవతైతేనేమి? మనదారిన మనం బోదాం.

వేరిగాఁడు—కాదురా! ఇది యెవతో ఆడమనిసిలాగే యుంది. అన్న! దానివొంటిలో సొమ్ములు ధగ్ ధగ్ మెరుస్తాయిచూచా. దీని చావమోకితినూ ఈసొమ్ములంతా దొర్కుతాది.

అని దాపునకుఁబోయిరి. ఆమెనుచూడఁగా భయవిభ్రాంతురాలై యుండెను.ఆమె నేత్రములు అశ్రుపూరితములై యుండెను. అందఱును ఆమెను మానవస్త్రీయనియే యెఱిఁగిరి. దానియం దొకఁడుమాత్రము ఇందిరపై ప్రీతిగలవాఁడగుటచే చంపుటకు నిష్టపడక బలవంతముగా నామెను తనయింటికిఁ గొనిపోయి సుఖింపనెంచెను. ఇందిర బుద్ధిశాలులలో మేలుబంతియగుటచే నిటు యోజించెను.

'ఇప్పుడు నేను అసహాయురాలై యుండుటచే నీ కార్యము నుపాయముచేతనే సాధింపవలయు. వీరలు పరోపకారులగు పురుషోత్తములయినచో నానిజస్థితి నెఱింగించిన జాలిగొని నన్నుఁ గావఁగలరు. వీరో నీచహృదయులు; అందులో చోరులని వీరిమాటలవలననే విదితము

య్యె. కనుక వీరియెడ కపటరీతిగా నే వర్తించెద' నని వారు సమీపమున వచ్చుటఁగాంచి.

'అయ్యా! మీరెవ్వరో! నాపాలిదేవతలవలె నిట కేతెంచితిరి. మీకుదయ గలదేని నన్ను మీతోడఁ దోడుకొనిపొండు. తాముచెప్పిన పనులన్నియుఁ జేసెదను. నా యత్తగారును పెనిమిటియునుఁ బెట్టుపోరు నేఁ బడలేక యీవనమందుఁ జేరితిని. ఐన నాదిమాత్ర మొకచిన్న విన్నపము. నేనొకవ్రతమాచరించుచున్నాను. ఈవ్రతప్రభావముచే పురుషులుమాత్రము మూఁడుగజముల దూరమునందుండి నా మాటలాడవలయు. ఈబాధ యింక ఒక నెలవఱకే; పిదప మీరందఱు నాసమీపమునకు రావచ్చును. ఇందులకు సమ్మతించితిరేని యిప్పుడు మీవెంట నే వచ్చెదను.'

వీరన్న యిదివఱకే నామెను ఎట్లయినను బలవంతముగా తనయింటికిఁ దీసికొనిపోవ నెంచియుండెను. ఇప్పుడు తనంతటతానే వచ్చునది మహాభాగ్యమని తలఁచి అందులకు సమ్మతించెను. ఇందిరాసమేతముగా నందఱు వెళ్లిరి. కొంతసేపటికి ఒకచిన్నగుడిసెయు దానియందు కాంతిహీనమైన యొకచిన్నదీపము మినుకు మినుకుమని యుండుటయుఁ గనుపట్టెను. ఆహా! వంటయింట కుందేలుచసినట్లు మనయిందిర యామట్టియింటిలోన ప్రవేశించెను. క్రూరకష్టులును- అందులోను- కఠినహృదయులును అగు ఆపాపాత్ములపాలఁ బడ్డయిందిరనుఁ జూచిన నెట్టి వజ్ర

కతనను హృదయమును నీరుకాఁగలదు. అందఱును ఇం
దిరనుఁ జూచి ‚నీపేరేమని? పిల్లా!' అని అడిగిరి.

ఇం.——‚నాపేరు భారతియని చెప్పుదు'రనెను. ఆనాఁటనుం
డి యందఱును భారతియనియే పిలుచుచుండిరి. కొద్ది
దినములలోనే యిందిర తనయందు వారికి నమ్మకము
కలుగునట్లు ప్రవర్తించుచుండుటచే ఒకరోజున ఒంట
రిగా వదలిపోయిరి. నాఁడు ఇందిర మిక్కిలి దుఃఖిం
చుచు 'ఏమిచేయుదాన; ఈపాపాత్ముల చేతనుండి
ఏలాగున తప్పించుకొని పోవుదును? నాకింతవఱకు కష్ట
ములపై కష్టములే వచ్చుచున్నవి. ఇచ్చటనుండి త
ప్పించుకొని పోయిన మఱియింకేమిరాఁగలదో! లేక
యిందే యుండిన వీరు నన్ను తప్పఁదలఁతురు' అను
కొనుచు విచారముతో నొకగదిలో కూర్చుండి యే
మో యోజించుచుండెను. అపు డామె నేత్రములకు
ఒకవిధమగుకాంతి గన్పించెను. అదియేమైయుండునని
తలఁచిఁ జక్కఁగాఁ బరిశీలించి చూడఁగా నొక యుం
గుళీయకముగానచటఁ గనఁబడెను. దానినిఁ జూచినపు
డు పూర్వము రాజశేఖరుని ముద్దుటుంగరము జ్ఞప్తికి
వచ్చినది. దానిపోలికగానుండుటచే ఆమెకు సందేహ
ముకలిగి దానిని చేతఁ దీసి చూచెను. ‚ఆహా! నేఁడేమి
నాకన్నులకు మాంద్యము కల్గెనా? నాచిత్తము చ
లించెనా ? లేకనాకు మతిభ్రమము కలిగెనా, యని
తలంచి కన్నులఁదుడుచుకొని మున్మూఁటికా యుంగర

మను ముద్దుఁ బెట్టుకొనుచు తన వేఁడికన్నీటిచే దాని నభిషేకముగావించి యిట్లు విలపింపఁదొడఁగెను.

'ఏమి! నామనోహరుని పేరుచెక్కఁబడిన యీముద్దుటుంగరము ఇక్కడికెట్లు వచ్చె? ఒకవేళ దుర్మార్గులచేతిలో నాప్రాణనాథుఁడు చిక్కియుండును. వారు నాప్రియునిఁజంపి యాతని చేతిలోని యుంగరము నపహరించియుందురు. ఇందులకు సందేహము లేదు. తొలుత నన్నుఁ జూచినపుడును వారట్లొనరించుటకే యెంచియుండిరి. అట్లుచేసి యుండిన వీరునాకు పరమోపకారులై యుందురు.

'నాథా! నిన్ను వెదకు నుత్సుకతచేతఁగదా నేనీఘోరారణ్యములు సయితము ఉద్యానవనములవలె నెంచి భయమొందక తిరుగుచుంటిని. నీ నామస్మరణమే దివ్యమంత్రముగా తలఁచియుంటిని. ఇఁక నేనెవ్వరినిఁ దలంతు? ఎవ్వరినిమిత్తమింతకాలము నాప్రాణములను ధరించితినో అది యిపుడు వ్యర్థమాయె. నాథా! వేయిమాటలేల! ఇహపరలోకముల యందును నీవే నాకు పరమదైవము. నీవులేనిది నాకు ప్రపంచమే లేదని తోఁచును. నీనిమిత్తముగానే నన్ను బ్రహ్మసృజించెనుగాన ఇపుడే నీవున్నచోటికి వచ్చెదాన' నను చురోదనము చేయుచు ఎవ్వరైన తన్నుగుర్తింతురేమో యను భయముచేఁ దన నేత్రములఁ దుడుచుకొని 'ఊరక దుఃఖించుట వలన ఫలమేమి?' యని ఇఁకజరుగవలసిన కార్యమాలోచింప మొదలిడెను. 'నేను దుఃఖించినదియాదురాత్ములెటిఁగిరా ఏమి

విపరీతము కలుగునో! ఇచ్చటనుండి విడివడితినా చచ్చుట
కైన వీలు గలుగును. నాకీప్రాణములతో నింకఁబని లేదు.
ఇది నాకు కడుభారముగాఁ దోఁచుచున్నది. ఈకారాగృ
హామునుండి తప్పించుకొనువిధముమాత్రము నాకు కాన
రాకున్నది' అనుకొనుచుండఁగా బయట 'భారతీ! భారతీ
తలుపుతీయు' మనుధ్వని వినఁబడెను.

ఇం.—'దైవమా! నేఁడు నాముఖలక్షణములు గుర్తించి నే
ని నాయం దింతవఱకు వీరికున్న నమ్మకముగూడ లేక
పోఁగల' దనితలఁచి చిఱునవ్వు దెచ్చుకొని తలుపు
తెఱచెను.

వీరన్న—భారతి! మందహాసముచేయుచు తనయెదుట
నిలఁబడియుండుటఁ గాంచి మిక్కిలి ఉల్లాసముతో
'భారతీ! నేఁడేమీ నీవు బలేసంతోషంగావుండావు?

భారతి—సంతోషమునకు కారణము లేకపోలేదు, రేపు
టితో నావ్రతము ముగియుచున్నది' (అనునంతలో)

వీర—చేతులుతట్టుకొనుచు 'బలే! బేష్! ఈనో భారతీ! రేపు
టితో నే నీనుగడికికూడా స్నానంచేయి. నేను చక్క
నివాఁడకాదా! నిజం చెప్పాల.

భార—దానికేమి లే. స్నానమన్న జ్ఞప్తివచ్చెను. రేపు
ప్రొద్దుననే నేను స్నానమాచరించి గంగిపూజ కావిం
పవలెను. రేపుతప్పినా, తిరిగి ఒక నెలవ్రతమునలు
పవలసివచ్చును.

వీర—'అబ్బ! ఇంకవద్దు,ఎన్నాల్లు, ఏన్నాల్లు, ఉన్నాయి? దూరముగా ఉండేటాందుకు నాచేతకాదు. దెగ్గిరయే మి గుంటగిట్ట లేదే! ఒక్కరాయివడ్డా లే. నీవు ఎక్కడ నడుస్తావు?

భార—నడుచుట కేమి? లేకున్న గుఱ్ఱములున్నవికదా.

వీర—నేనెంతదూరమైననునడిసేదే. నీకోసరమే చెప్పాను.

భార—అయిన నేనున్ను అశ్వముపై నెక్కి వచ్చెదను.

వీర—నీవు ఆడ్దానివే? నీవు గుఱ్ఱం ఏల్లాఎక్తావు?

భార—మాయూరిలో ఆడువారేవిశేషముగా గుఱ్ఱముపై సవారిచేయుదురు. నాకు గుఱ్ఱపుసవారిచక్కగా తెలియును.

వీర—అయితే నీవొక్కదానివే పోరాదుసుమా. నీకు తోడుగా ఈయెల్లిగానిపంప్తా.

భార—సరి. అట్లేచేయవచ్చును; కాని, నేను వేకువజాము ననే వెళ్లవలె. సూర్యోదయముకాక మునుపే స్నానజపాదులు ముగియవలయు. ఇప్పుడే రెండుఅశ్వములు ఆయత్తము చేయవలెను.

వీర—ఓరీ ఎల్లిగా! రేపు పొద్దున్న మనభారతీ ఒళ్లోకడు కోటానికి వెల్తాది. మఱ్ఱిచెట్టుచాటునవుండే చెరువుకు తోలుకొని పోవాలె. బద్రము. వుసారు. నిదరతీయరాకు.

ఎల్లి—లేదు సామీ! రెండుజాములెక్కే లేసికూకుంటాను.

భార—ఇదిగో యెల్లన్నా! రేపు ప్రొద్దున గుఱ్ఱములను ఆయత్తముచేయుటకు అవకాశముండదు. ఇప్పుడే అంతయు సిద్ధపఱచి యుంపుము. నేను పిలిచినప్పుడు రాఁగలవా?

ఎల్లి—అమ్మా! అట్లు చెప్పఁబాకు. అసలు రెయ్యి అంతా దోమలు చెవులగుయ్యాంగుయ్యాం అంటాదే ఇక నిద్ర ఏంటిది?

భార.—రేపునాకు పండుగ దినముగాన నీవు ఎచ్చరికగలిగియే యుంటువని నాకు తెలియును.

సగమురాత్రి గడచెను. ఇందిర తనకు స్నానాంతరము, ధరించుకొనుటకై ఒకచిన్నమూటలో కావలసినవన్నియు సిద్ధపఱచి, ఎల్లిగానిచేతికిచ్చి 'ఇది నాయశ్వమునకు కట్టు' మనెను.

ఎల్లి.—అమ్మా! మీపలుక్కు నాకొక్కటి తెలవదు. అశ్వమేంటి?

ఇందిర.—(నవ్వుచూ) అశ్వమన్న తెలియదా? అఖనను గుఱ్ఱమునకుఁ గట్టుము.

ఇద్దఱును ప్రయాణమై మఱ్ఱివనమును చేరిరి.

ఇందిర—ఎల్లన్నా ఆఁడువారు స్నానముచేయునప్పుడు పురుషులు దూరముగా నుండవలయును. కాన నీవు మా

త్రము కొంతదూరముగానే ఉండుము. నేను పిలుచునపు
డు మాత్రము వచ్చినచాలును.

ఎల్లి.—'ఊ' అనెను. ఇందిరమాత్రము నదికడకు పో
యెను. కొంతసేపటికంతయు నాజలములో గొప్పశబ్ద
ముకలిగెను. ఎల్లిగాఁడు అదిరిపడి 'హోహోరే అన్నా!
ఈపాపి దీనిలోపడి చచ్చింది గామల్సు' ఎక్కడ తిప్ప
లు. ఈరనాయకునితో ఏమని చెప్పాలే. అనుచు నలు
దిక్కుల పరికించిచూచి 'ఇప్పుడే వొరకాలే మారి
గాన్కి ఈఁత లెస్సతెల్సును. ఇప్పుడే ఎల్లి చెప్తాంలే'
అనిగంతులు వేయసాగెను. వీరన్న యెదురవచ్చెను.

వీరన్న.—ఒరేపాపిష్టి ముండాకొడకా? కొంపతీసావేమి
రా? అడ్వారిమాటలు నమ్మరాదు.నిన్ను మోసగించి
ఆగుంటలోనే పడిచచ్చిండి. మారిగాని పలుకులు అ
యినవినివుంటే దాన్నిపై నావుంచ సామ్ములై నా దొరి
కివుణ్ను కదరా! అయితే గుడ్డా లేదిరా?

ఎల్లిగాఁడు.—దాన్ని వూరికె విడిచి వేసివుంటిని. ఏమైన్దో!
ఎట్లునో! ఎవర్కి ఎఱుక!

వీరన్న—మారిగా! చక్కాచూచావా.

మారిగాఁడు.—అవును సామీ బురదలోకూడా పాకిపాకి
వెతికినాను సామీ. ఆడ్వారిలో నేనింత టక్కరదానిని
ఎన్నడూ ఎరుగ.

వీరన్న—పూరికె ఎవ్వర్ని అనవద్దు. ఆమూలదేవుఁడే
ఇట్ల చేసాఁడు. లేకుంటే చేతిలోని పిట్ట ఎగురుతుందా

వారిగాఁడు—ఇంకేమి అన్నంటే ఏమిచేయాల? వారికె
కూర్యమయ్య అనకుండా పడిపుండవలసిందే.

వీరనాయకుఁడు మాత్రము ఇందిరపైఁ గల మోహమును త్రిప్ప లేకయుండుటచే ఆమెను గానకుండుట వానికి కష్టముగా నుండెను. ఇఁక రాజశేఖరునికడకు వత్తము.

అయ్యో! ఎన్నిదినములా రాజశేఖరుఁడు నిద్రయు అహారమునుమాని తన ప్రియురాలిని వెదుకఁగలఁడు. తుదకిట్లు తలఁచె నేనిడిన ప్రతిజ్ఞతీఱుటకు ఇంకను ఐదుమాసములున్నవిగదా! ఇంతకాలముగా వృథా అడవులయందు తిరిగి తిరిగి విసుగు కలుగుచున్నది. ఇఁక నీయైదుమాసములు ఒక రాజ్యములో ఉద్యోగమునందుండి దానిమూలముగా నా ప్రాణేశ్వరి వృత్తాంతము ఏమైనను తెలియునేమోచూచెద. రాజ్యాంగములయందు సకల విషయములు నెఱుంగుటకు అవకాశముకలదు. అనితలఁచి బహుదూరము నడచి ఒక దేశము చేరి అందొక్క పూఁటకూళ్లమ్మయింటికి పోయి—'అమ్మా! నాయొద్ద నేమి పైకము లేదు. నీకిష్టముండిన ఒక్క వారము రోజులవఱకు నాకు అన్నము పెట్టినయెడల ఈదేశపు రాజునొద్ద కొలువు పట్టుకొని నీ ఋణము తీర్చెదను. నాయందు నమ్మకము లేనిచో నీవు శ్రమపడవల'దనెను. అందుల కాపూఁటకూళ్లమ్మ 'నాయనా! నాకొక కొడుకు ఉండెను. రెండుమాసముల క్రిందట వాఁడు జ్వరపీడితుఁడై పరలోకమున కేఁగెను. నిన్ను చూడఁగా నాతనయుఁడు జ్ఞప్తికివచ్చుచున్నాఁడు. నీవు ధన

మేమియు నియ్యవలదు. నానిమిత్తము ఎట్టికొలువున
కుపోవలదు. ఇచ్చటనేయుండి నాపుత్రి దుఃఖము మా
నునట్లుచేసినచాలును' అనియానాఁటినుండి రాజశేఖరుని
అన్నపానాదులయందు కడుశ్రద్ధ వహించియుండెను. రా
జశేఖరుఁడు స్వభావముచేతనే మంచివాఁడు; అట్టివానికి
ఉపకారము నొనరించినదగుటచే ఆమెయందతఁడు మా
తృభావముతో నడచుకొనుచుండెను.

ఒకనాఁడావృద్ధురాలు రాజశేఖరునిఁజూచి—'నాయ
నా! రేపు నీవు రాజుగారిదర్శనార్థము పోవఁదలఁచియు
న్నావుగాన, ఈమురికివస్త్రములతో పోరాదు. ఇదిగో
ఈపైకముగొనిపోయి నీకిష్టమగు వస్త్రములనుగొను'
మని చెప్పి రూప్యములునిండిన యొకచిన్నసంచిని రాజశే
ఖరునిచేతికిచ్చెను. అతఁడు శీఘ్రకాలములోఁ ఆమెఋణము
తీర్పఁగలమని తలఁచి, ఆధనమును అంగడివీధికిఁ గొనిపో
యి వలయువస్త్రములను గైకొని ధరించి 'అమ్మా!
చూడుము. ఇది బాగుగనున్నదా' యని అడిగెను.

ఆముసలవ్వ, 'నాయనా! రాచపట్టివలె ఉన్నావు.
రేపుఉదయమున రాహుకాలమునకు మునుపే రాజుగారి
దర్శనముఁ బడసిరమ్ము! నీకుఁ దప్పక సదుద్యోగమే లభింపఁ
గలదు. నీగుణమునకు తగినట్లే నీరూపముగూడ వన్నె తె
చ్చుచున్నది. ఎట్టివారికైనను నిన్నుఁజూచిన ప్రేమ జని
యింపకుండ' దని చెప్పిపంపెను. రాజశేఖరుఁడు ఆదేశ

పురాజగు ప్రతాపసింగుమహారాజుసభకు పోయి నమ
స్కరించి నిలిచెను.

ప్రతా—అయ్యా! నీవెవ్వరు? నిన్నుచూడఁగా సద్వంశ
సంభూతుఁడవని తోఁచుచున్నది. నీరాకకు కారణ
మేమి?

రాజశే—రాజచంద్రమా! నాదిమగధదేశము. తమసా
న్నిధ్యమున ఒకకొలువునందు ఉండుటయే నారాకకు
కారణము. దేవర కిష్టముండినచో ఇందే కొలువుచే
సెద.

ఆరాజసింహుఁడు 'నీది మగధదేశమా! పాపము
మీరాజు, యుద్ధమున పరాజయముఁబొందుటచేతఁగదా నీ
విచ్చటికివచ్చితివి. చక్రవర్తి కుమారుఁడు; పుత్రవియో
గమునందు మునిఁగియుండినవృద్ధునిపై తనపరాక్రమగర్వ
మును చూపెను. అతఁడేమిచేయఁగలఁడు?' అనెను.

ఈమాటవినఁగానే రాజశేఖరునికి దేహము కంపిం
పసాగెను. కన్నులనుండి బాష్పములు గాఱఁజొచ్చెను.
అతఁడట్లే కొంతసేపు ప్రమానుపడియుండెను. ప్రతాపసిం
హుఁడు రాజశేఖరునిఁజూచి 'ఏమి? నీవుమగధదేశము
ను వీడి ఎన్నిదినములాయెను? అతఁడు రాజ్యభ్రష్టుఁడ
యిన వృత్తాంతము నీ వెఱుఁగవా? ఇందిరా రాజశేఖ
రులు ప్రవాహమున హతులయిన సంగతియు నీకెఱుక
లేదా?'

రాజశే — ప్రభూ! మగధాధీశుఁడు నన్ను పుత్రునివలె చూచుచుండెను. నాకును అతనియందు భక్తివిశ్వాసములు కలిగియుండుటచే నతనికి పరాభవము కలిగినదను కఠినమైనవార్త నా ప్రాణములను తీసినదయ్యె. ఆనిమిత్తమే నాకు దుఃఖము కలిగెను.

ప్రతాపసింగు — అయినను అతఁడిట్టి దుఃఖమున నుండినపుడు నీవేల యతనిని విడనాడి వచ్చితివి?

రాజశే — నేనును ఆ రాజశేఖరునితోడనే వచ్చినవాఁడగుటచే నాకచ్చటి సంగతులు ఏమియును తెలియక పోయెను. నేను పాపకర్ముండనగుటచే బ్రతికివచ్చితిని. పాప మాదేవియు రాజశేఖరుండును ఎచ్చటనున్నారో, ఏమైరో, లేక ప్రాణములనే పాసిరో, వారియుదంతము నాకు తెలియువఱకు నేను మగధదేశమునకు పోవుట లేదని నిశ్చయించుకొంటిని. నేఁడు కర్ణకఠోరమైనవార్తవినుటచే మఱికొంత విచారమాయెను' అనుచు, కన్నీరు విడిచెను. భూతదయాపరుండగు నా రాజునకు రాజశేఖరుని యెడల మిక్కిలి జాలిపుట్టఁగా నతనితో, 'నిన్ను నా సేనా నాయకునిఁగాఁ జేయనెంచియున్నాను. అందులకు నీ వంగీకరింతువేని ఇప్పుడే కైకొనుము'

రాజశే — ప్రభూ! చిత్తము.

ప్రతాప — అయినను నీ పేరేమని పిలువవలయు?

రాజ శే.—నా పేరు ప్రభాకరుఁ డని పిలువవచ్చును.

నాఁటి మొదలుకొని రాజశేఖరుఁడు ప్రభాకరుఁడని నామధేయము నుంచుకొని రాజసభకు పోవుచు అచ్చటి కార్యములన్నియు అతినిపుణతతో నిర్వర్తించుచు నాదేశమునం దందఱకు తనయందు ప్రీతికలుగునట్లు చేసి కొనియెను. రాజు క్రమక్రమముగా ప్రభాకరునికి జీతము హెచ్చించెను. మునుపటికంటె తనకుజీతము హెచ్చుగా వచ్చుటచే, ఆపూఁటకూళ్లమ్మను రాజశేఖరుఁ డా పనిని చాలింపుమని పలికి తనగృహమునందే సుఖముగా ఉంచుకొనియె. ప్రభాకరునికి దినదినము తనప్రియురాలికారణముగా దుఃఖమధికమగుటచే చేయునది లేక సదాదుఃఖితుఁడుగానే తనకాలము గడపుచుండెను.

ఒక్కనాఁడు ఆపురమున బజారు వీధిలో ఇంతవఱకుఁ జూచియెఱుంగని నూతనపురుషుని జనులు గాంచిరి. అతఁడు సిపాయి దుస్తులను ధరించుకొని యుండెను. కాని, యతని ముఖలక్షణములందు మాత్రము రాజకళలు దేఱుచు చూచువారి హృదయమునకు అహ్లాదము కూర్చుచుండెను. అతనిని చూచినతోడనే యూరి కాంతలు ముక్కున వ్రేలుచేర్పసాగిరి. పురుషు లందఱు సిగ్గుచే తలవంచుకొనిరి. కొందఱు 'ఆహా! ఇట్టిసుందర పురుషుని సృజించుటచే ఆచతుర్ముఖుని ఎంతయు కొనియాడఁదగును. ఇట్టిరూపరేఖావిలాసములను మేమెన్నఁడు చూచినది లేదు. ఈతఁడీదేశమునకు క్రొత్తవాఁ

డగుటచే నిలిచి యొక్కమాటైనను పలుకక పోవు చున్నాఁడు.' అనిరి.

ఉద్యానవనమున మిక్కిలి విచారముతో నొక్క యౌవనవంతుఁడగు పురుషుఁడు కూర్చుండి 'ఎన్ని దినములు కపటముగా వర్తింపఁగలను. అడిగినవారికి నా పేరేమని చెప్పుదును? ఎవ్వరైనను నన్ను గుర్తింతురేమోయను భీతిచే, నేను చెఱఁగున నిప్పుమూట కట్టుకొన్నట్లు ఉన్నాను!' అని, తన జేబులోనుండి యొక కాగితమును వెలికిఁదీసి చదువుకొనుచుండెను. తటాలున నెవఁడో అచటికివచ్చి వాని చేతులను గట్టిగాపట్టుకొని, చేతిలోని కాగితమును దీసికొని చదివి శిరఃకంపము చేయుచు 'ఓరీ! రాజద్రోహీ! నిన్ను ఒక్కక్షణమైనను ఇఁక ప్రాణములతో నుండనియ్యను. నేను దూరముగానుండి నీకపటవర్తనమంతయుఁ జూచుచుంటిని' అనుచు తనచేత ధరించియుండిన కరవాలమును పైకిదీసి వాని శిరమును ఖండించి కోపావేశముతో కన్ను లెఱ్ఱచేసి కొని యుండెను. దూరమునుండి 'ఎవ్వఁడా రాజద్రోహి? చంపుము పోదుపుము' అనుటవినఁబడెను. అందుచే అతఁడు నిశ్చేష్టితుఁడై నిలిచి యుండెను. దూరమునందుండి చెప్పుచుండిన ప్రభాకరుఁడు సమీపమునకు వచ్చి 'పురుష పుంగవా! ఏల యితనిని జంపితివి? నీవెవ్వరో నూతనపురుషుఁడు గానాకు తోఁచుచున్నది. నీకు నితని యందేమి సందేహముకలిగియిట్లు చంపితివి?' అనియడిగెను. అందులకా

పురుషుఁడు 'అయ్యా! నేనెవ్వరయిన నేమి? మీరు వచించు నట్లే నే నీయూరికి క్రొత్తవాఁడను, నేఁటిఉదయముననే, నేనీదేశమునకు వచ్చికొంత విశ్రాంతిఁ బడయుటకై ఈ వనమునందు ప్రవేశించితిని. అట్టిసమయమున వీని నేను గాంచితిని. అది యేమికారణము చేతనో నామదికి వీఁడు గూఢచారి అనితోఁచుటచే, వీనికిఁ దెలియకుండ ఆవృక్షముచాటుననిలిచి అంతయు చూచుచుంటిని. వీఁడేమో చెప్పుకొనుచు, తన జేబులోనుండి ఈకాగితమును చదువుకొనుచుండెను' అనునంతలో ప్రభాకరుఁడు సంపూర్ణముగానాలేఖను చదువుకొని'ఆహా! నాకంతయుఁ దెలిసె. వీఁడు కాశ్మీరాధీశుఁడు పంపిన గూఢచారుఁడు. ఇట్టి వానిచంపుటచే మాకు పరమోపకారము గావించినవాఁడ వైతివి, నీవుతప్పక మా రాజుగారి దర్శనముచేసి వారిచే గొప్పసత్కారము పొందఁదగిన వాఁడవు' అనుచునాతనిని దన వెంటఁ బిలుచుకొని పోవుచుండెను. ఇంతలో నీవృత్తాంత మాయూరివారందఱు నెఱిఁగి గుంపులు గుంపులుగాఁగూడి 'మనము కొంతకుమునుపు చూచిన పురుషుఁడు వచ్చెనఁట;అట్టిసౌందర్య నిధియైన పురుషుని ఇఁక మనము ఎన్నఁడును జూడఁబోము' అనిరి కొందఱు 'కాదు కాదు ఆనూతన పురుషుఁడే దారిలో నెవ్వరినో రాజద్రోహినిగాంచి వధించెనఁట. అందుచేనేఁటి మధ్యాహ్నమతనిని రాజసభలో సన్మానించుటకై ఏర్పాటుచేయఁబడెను' అనిరి.

ప్రభాకరుని వెంటనే క్రొత్తపురుషుఁడును రాజసభను ప్రవేశించెను. ప్రతాపసింగు 'ప్రభాకరా! ఈతఁడు మనదేశమునకు క్రొత్తవాఁడయ్యును ఎన్నియో దినములుగా మనయొప్పుదినుచుఁ జిరపరిచితుఁడైనవాని వలె మనకుమేలుచేసిన వాఁడయ్యెను. కాఁబట్టి యితని కోరిక నే నెఱుఁగఁగోరుచున్నాను.' అనెను.

ప్రభాకరుఁడు 'అయ్యా, మారాజుగారు నీయందు మిక్కిలి దయగలవారై నీకోరిక యెఱుఁగఁ గోరుచున్నారు. కావున వచియింపుము.

నూతన పురుషుఁడు తనలో 'నాసుకృతఫలముచేతఁ గదా యానీచాత్ములపాలనుండి తప్పియిట్టిసజ్జనసహవాసముఁగాంచితిని. ఈప్రభాకరునిఁ జూడఁజూడ నాబంధువులలో నొక్కనివలెఁ దోఁచుచున్నది. ఈతనిలక్షణములను జూడఁగా నాప్రియుని జాడ తాండవ మాడుచున్నది. ఇచ్చటనేయుండి అంతయు నెఱుఁగవలయు. కాన, ఇందులకు సమయము చిక్కినది. ఇప్పుడీరాజచంద్రము నాకోరికఁ దెలియఁ బలుపు మనెనుగదా! ఇప్పుడు నాకుఁగలకోర్కి నాప్రియుని సమావేశ మొక్కటియే' యని తలఁచి, 'మహాప్రభూ! నాకోరికయిదియే. కొన్ని రోజులు తమయొద్దనే కొలువులోనుండి ప్రతిదినమును తమ్ముదర్శించుచు కాలము గడపుచుండెద. కొన్ని దినములలోనే నేను దాస్యవిముక్తుఁడైనను, లేక దేహావిముక్తుఁడైనను, అయ్యెద.

ప్రతాపసింగు:—"నీపలుకులవలన నీకేదో యొక గొప్పసంకట మున్నట్లు దోఁచుచున్నది. భీతిల్లక వచింపుము."

నూతనపురుషుఁడు 'రాజచంద్రమా! నాకెవ్వరు నెట్టియపకారమును జేయలేదు. నేనుమాత్రము దైవము నెడల అపరాధినగుటచే నాకు సర్వబంధుజన వియోగము కలిగెను.

ప్రభా.—'అయ్యా! విచారపడకుము. సుఖదుఃఖములరెంటిని సమముగానే యెంచవలయును. ఈప్రపంచములో దుఃఖములేని వారెవ్వరు? కాన, నీవు చింతనూని నెమ్మదిగా నుండుము.కడచినదానికి వగచుట వెఱ్ఱితనము' అని ధైర్యోక్తులఁ బలికెను. ఈయుపదేశము లాతనికి వేదమాత్రములై తోఁచెను. కొంతకాలమువఱకు నారాజునొద్ద కొలువుచేయ సమ్మతించి, తనపేరేమని యడుగ 'పూర్ణచంద్రుఁ'డని చెప్పెను. అది మొదలాతఁడు ప్రతిదినము రాజసభకుఁ బోవుచు రాజ్యాంగ విషయములను సూక్ష్మబుద్ధితో నరయుచు కొద్దిదినములలోనే ఆరాజుగారికిని ఆరాజసభలోని వారికిని మిత్రుఁడై మెలఁగుచుండెను. ఒక్కనాఁడు పూర్ణచంద్రుఁడు, 'ఆహా! పెద్దలు చెప్పినామొత వ్యర్థముగాదనుట సత్యము. దరిద్రుఁడు తలగడుగఁబోయిన వడగండ్లవాన వెంటనే వచ్చె ననుట నాయందే తేలుచున్నది. నాదురదృష్ట ఫలముచే ఎన్నిమాఱులో నాప్రియుని సంధింప వలయునని తలఁచినను

ఒక్క సమయమున అది చేకూడినను అప్పుడే అనేకవిఘ్న ములు కలుగుచున్నవి. మేమిరువురము నేకదేశమందుం డిన వారయ్యు, ఒకరాజుచెంతనే కొలువుగొలుచుచు అన్ని సమయములందు నొకరినొకరు చూచుటకు తటస్థించియు, నావిధివశముచే నేనేయాతని ప్రియురాలనని యెఱింగించుట కవకాశము కలుగలేదుగా! అయ్యో! నేనిప్పుడే వెళ్లి నాప్రాణేశ్వరునికడఁజేరి యతనికి నాదువృత్తాంతము లన్నిటి నెఱింగించెద. చేత వెన్న నిడుకొని నేతికై యేల చింతింపవలయు? కాదు, కాదు; ఒకసమయము నావృత్తాంత మెఱింగించిన, నతనికి నాయందు అసూయ కలిగి నన్ను నిరాకరించునేమో! కాన, అతఁడేకాంతస్థలమునందుండునపుడు మఱుఁగునందుండి, తనప్రియురాలిని బాసినందులకై యేమైనను విలపించునేమో చూచెద. పిదప నాయుదంతమంతయు నెట్లు ఎఱిఁగింపవలయునో ఆలోచించెదను' అని కొద్దిరోజులు రాజసేవకుని మన స్సెఱుఁగుటకై వేచియుండెను.

ఒక దినము ప్రభాకరుఁడు తనలో 'ఇదియేమి చిత్రమో కాని, రాజుగారు ఏపని నాకని నియమించినను పూర్ణచంద్రుఁడు 'ఈ స్వల్పకార్యమును అట్టి మహానుభావునకుఁ జెప్పవలయునా? నేనే యాచిన్నపనిని నెఱవేర్చెదను. నేనుండునందాఁక ఇట్టి స్వల్పకార్యములకై ప్రభాకరునికి శ్రమకలిగింపనని చెప్పుచున్నాఁడు. ఏనిపలుకులను జూడఁగా నా

యందు దయగలవానివలె తోఁచుచున్నది. ముందు వెనుక నన్నెఱుంగని యీతనికి నాయం దిట్టి ప్రేమ యెట్లుజనించెను? కాన, నాయందు రాజగారికిఁ గల ప్రేమను మరల్చి యావత్కార్యములను తానేనిర్వ హించినచో రాజుగారికి తనయందు విశేషప్రీతి కలుగు నని తానిట్లు కావింపవచ్చును.ఒకసమయము, ఈపూ ర్ణచంద్రుఁడు నిరపరాధి నయిననాయందు మిత్రభా వముచే నిట్లు గావించియుండినను నేనిదివఱ కాతని శత్రుసమానునిఁగా నెంచినందులకు నాకు ఘోరనర కము తప్పదు" అని యోచించుచు, మరలఁదనలో 'రాజుగారికి పూర్ణచంద్రునిపై మునుపటికంటె ప్రేమ యెక్కుడాయెను. ఇంతవఱకు ఎట్టికార్యమైనను నేను లేక జరుగదు అనితలఁచి నాతోడనే చెప్పుచుండును. ఇప్పుడో సమస్తకార్యములయందును పూర్ణచంద్రునే నియమించుచున్నాఁడు. ఏవారిదయయు నా కేమివల దు. నాజీవితేశ్వరునిఁ జూడక నేనింక బ్రతుకువాఁడను గాను'అని తనలోఁబాఁ దలఁచుచు పూర్ణచంద్రునియం దు ఒక్కొకసమయము అసూయభావముతో మెలఁ గుచుండెను.

ఒకనాఁడుపూర్ణచంద్రుఁడు 'హా! దైవమా! నేఁ డెట్టిదిన ము! నిన్నరాత్రియేకదా నాప్రియునికి సకలవృత్తాంత మును,ఎఱింగింపవలయునని నిశ్చయించుకొంటిని. ఇంతలో నే యీపిడుగువంటివార్త వినవలసి వచ్చెఁగదా. రేపే నేను

యుద్ధమునకు వెళ్లసిద్ధముగా నుండవలయును. రాజుగారు తొలుత నాప్రభాకరునే పంపనెంచెను. అతని కేమైనను హానికలిగిన నేనుమనఁగలనా? కనుక నేనేయాకార్యమున కుఁ బూనుకొంటిని.యుద్ధమున జయాపజయము లూహించుట కష్టసాధ్యము. దైవానుగ్రహముచే జయమే తటస్థించిన మహాసంభ్రమముతో తిరిగి నాప్రియునిఁగలసికొని యెద. లేకమఱియొక విధమయ్యెనా, వీరస్వర్గముఁ బొందఁగలను. రెండునుసమ్మతములే కాని, నాప్రియుని సమరమునందు మాత్రము రప్పింపరా'దని కాశ్మీర దేశమునకుఁ బోవుచుండెను.

పూర్ణచంద్రుఁడు వెడలిపోయిన పిదప నొకనాఁడు ప్రభాకరుఁడు 'పూర్ణచంద్రుఁడు లేనందున నా మది నెమ్మదికలుగకున్నది. ఒక్క సమయమునందు పూర్ణచంద్రునిపలుకు మిక్కిలి యాదరణీయముగానే తోఁచుచున్నది. నాయందాయనకు అట్టిప్రేమ జనించుటకు కారణమేమైయుండునో ఎఱుఁగరాకున్నది'.అనిమరల తనలోఁ దాను'నిన్నటిదినము పూర్ణచంద్రుఁడు వ్రాసిన యుత్తరమువలన జయము సిద్ధమనితోఁచుచున్నది' అనుకొనుచుండెను.

ఇది యిట్లుండఁగా— అచట కాశ్మీరాధీశుని సేనలు మనపూర్ణచంద్రుని బాణవర్షమునకాఁగలేక చెల్లాచెదరగుచుండుటఁగాంచి యారాజున కెంతయు భీతి కలుగుచుండెను. ఒకనాఁడు మంత్రిసత్తమునిఁ గాంచి 'మంత్రి

వరేణ్యా! ఇంతవఱకు లక్షయేఁబదివేల సైన్యములు మడిసినవి. ఇఁక జయలక్ష్మి దూరమనియే తోఁచుచున్నది.

మంత్రి:—'మహాప్రభూ! భీతిల్లకుఁడు. వీరశిఖామణి యని వాసిఁగాంచిన మీయట్టివారినోట నిట్టిపిఱికి పలుకులు వచ్చుటకు వారిభాగ్యమే తగిన కారణము. రేపు మనవీరసింహు నొక్కని బాహుబలమునకు బదులు చెప్పినఁ జాలదా! రాజేంద్రా! మనవీరసింహుని శూరులలో శూరుండని నీ వెఱుంగవే. కాన, తమరు ధైర్యముతోనే యుండవలయు' ననెను.

మఱునాఁ డుదయమున యథాప్రకారము యుద్ధమారంభమాయెను. కొందఱు శూరులు పండ్లు పటపటఁ గొఱుకుచు మీసములపైఁ జేయివైచి 'ఓరీ! పిఱికిపందా! ఏదీ! నిలిచి ఒక్కక్షణకాలము రణమొసఁగుము. ఇదే యమపురిదారిఁ జూడు' మనుచు ఱొమ్మునపొడిచిరి. కొందఱు తాముదాల్చిన ఖడ్గములచే నఱికి చంపుచుండిరి. మఱికొందఱు, పరుషోక్తులాడి మనస్సు నొప్పించుచుండిరి. అనాఁడుమాత్రము, వీరసింహునికి బదులు చెప్పుటకెంతయు పూర్ణచంద్రునకు కష్టముగానే యుండెను. ఇరుదెసలవారికి సమసంగ్రామము జరుగుచుండెను. 'ఓరీ! నాకీ యెలుకలతోఁడఁ బనిలేదు. రమ్ము. వెలికిరమ్ము. ఇన్నిదినములుఁగా చేతులుతట్టి పిల్లుల నదలించుచుంటివే. అట్లుఁ కాదు ఈదినము. నాచేతఁ జిక్కినావు. మఱి నీప్రయాణమునకు మూటగట్టుమురా. నాకీలోకమున సరి

యెవ్వరని విఱ్ఱవీఁగుచుంటివే. ఇవుడు నేను తెలిపెద' అనుచు వీరసింహుఁడు పలుక పూర్ణచంద్రునికి అగ్ని హో త్రములో నేయి వ్రోసినట్లాయెను. కోపమున మండి పడ సాగెను. అంత వీరసింహునకును పూర్ణచంద్రునకును, గొప్పయుద్ధముజరిగెను.కొంత సేపటికంతయువీరసింహుఁడు 'ధర్మమార్గమున నింక వీనిని జయించుటకు వలనుపడదు. కాన కపటయుక్తులచేతనే జయింపవలయు'నని నిశ్చయిం చుకొని తనసైనికునకు కనుసంజ్ఞఁజేసి 'పూర్ణచంద్రుఁ డెక్కియుండిన గుఱ్ఱపుకాళ్లను నఱికింపు'మనెను. కుటిల హృదయులను దైవము శిక్షింపకుండఁగలదా? ఇది తెలిసి పూర్ణచంద్రుఁడు చటుక్కున తనగుఱ్ఱము నెగురఁజేయుట వలన నాయశ్వమున కేయపాయమును గలుగలేదు గాని పూర్ణచంద్రునిపాదాంగుష్ఠ మొక్కటియే నఱుకఁ బడియె. దానిని సరకుగొనక యతఁడు యుద్ధము జరుపు చునే యుండెను.కొంత సేపటికంతయు పూర్ణచంద్రునిచే వీరసింహునిశిరము భూదేవి కర్పింపఁబడియె. ఈ ఘోర మును జూచి యెదుటిసైనికులు ఇఁక చేయునదేదియు లేక పూర్ణచంద్రునే శరణుజొచ్చిరి. అతఁడు రఘురా ముఁడో యన్నట్లు వారలందఱికిని అభయమొసఁగిజయ భేరీలతో తనపట్టణమునకుఁ బోయెను.అతఁడు అచ్చటఁ జేరి రాజుగారికి వందనములాచరించి తన సౌధమునకుఁ బోయెను.మనపూర్ణచంద్రునిమతి యింతటికి స్థిమితముగా నందున నిదురపట్టదయ్యె.అపుడు తనస్వభావమైన స్త్రీవే

పమును ధరించి వీథివెంబడిఁ బోవుచుండెను. కొంత సేపటి
కంతయు ప్రభాకరునిమందిరమును బ్రవేశించెను. అచ్చటఁ
ప్రభాకరుఁడుమాత్రము తనపడుకపైఁ గూర్చుండి కన్ను
లఁదుడుచుకొనుచుండెను. కొంత సేపటికంతయు దుఃఖ
ముపట్టలేక నుదుటినిగొట్టుకొనుచు నేలఁగూర్చుండి యిట్లు
విలపింపఁదొడఁగెను.

'జగదీశా! లోకరక్షకా! ఆపద్బాంధవా! నేనేమి త
ప్పొనర్చినానని నాయందు దయఁజూపకున్నావు? నాకం
తె దుఃఖమున్నట్లును, ప్రాణములపై సహితము ఆసలేన
ట్లును, సన్న్యాసము స్వీకరించుటకైనను సిద్ధముగానున్న
వానిభంగిని, వచించిన పూర్ణచంద్రుఁడు రేపు రాజుగారి
యనుగ్రహముచే గొప్ప పదవిఁ బడయఁగలఁడు. అపుడత
ని దుఃఖమంతయు నెచ్చటికో పరుగెత్తఁగలదు. నాస్థితి
యట్లుకాదు. దినదినమునకును రాజుగారికి ఈపూర్ణచం
ద్రునిపై అనురాగ మెచ్చుటచే నాయందు ప్రేమ తగ్గు
చుండును. లోకమున నెవ్వరికైనను కొంతకాలము దుఃఖ
మనుభవించినను పిదప సుఖము కలుగుచున్నది. నాకో
యట్లుకాదు. దుఃఖముపై దుఃఖమే కలుగుచున్నది. నే
నింతవఱకు ఈకష్టముల సహితము సహించి యుండినది
నాప్రియురాలి కొఱకేకదా! ఆయాశ మఱి నిరాశయే.
నాకీలోకములో నాప్రియురాలి దర్శన మిఁక లేదు. నేని
ప్పుడే యీఖడ్గముతో నాప్రాణమును దీసికొని మాయిం
దిరం గూడుకొనియెద' నని చెప్పి కత్తిని జేతఁబూని, 'శ్రీ

హారీ! నాప్రాణము పోవుటకు మునుపు ఒక్కమాఱు నా ప్రియురాలిని జూపరాదా' యని ఖడ్గము ఱొమ్ముపై విసరఁబోయెను. ఇంతలో నెవ్వరో తనహస్తమునుఁ బట్టుకొనిరి.

ప్రభాకరుఁడు—విభ్రమముతోఁజూచి 'హా! ప్రాణేశ్వరీ' యని నేలపైఁ బడి మూర్ఛిల్లెను. అప్పు డిందిర, తన ప్రాణనాథుని శిరము మూర్కొని ముద్దిడి యుపచారము గావించుచును, అప్పుడప్పుడు కన్నులు దుడుచుకొనుచును, ప్రాణేశ్వరుని మోమున మోము జేర్చుచు దుఃఖించుచు నుండెను. కొంతసేపటికంతయు ప్రభాకరుఁడు తెలివి తెచ్చుకొని 'నేనేమిటుంగక నేలపైఁ బడియుంటిని? ఇప్పుడు నన్నెవ్వరు శీతలోపచారములచే మేలుకొలిపిరి. ఇంకెవ్వరున్నారు? ఆపూర్ణచంద్రుఁడే యుండవచ్చును. అయ్యో! పూర్ణచంద్రా! నీకేల నాయం దిట్టిప్రీతి? నాయిందిర పోయినపుడు తనకుబదులుగా నిన్ను నియమించిపోయినదా యేమి?

ఇందిర—ప్రాణవల్లభా! నేనిందిరచే నియమింపఁబడిన పూర్ణచంద్రుఁడనుగాను. నన్నింక నీయిందిరగా నే తెలియుము. నీదుఃఖము నేనింకఁ జూడలేను. నేను భాగ్యహీనురాల నగుటచే ఇంతకాలమునఱకు నిన్ను దుఃఖసముద్రమునఁ ద్రోసియున్నందులకు నన్ను మన్నింపవలెను' అనునంతలో రాజశేఖరుఁడు సంభ్రమముతో లేచి తన ప్రియురాలిని ఆలింగనముచేసి 'నా

ప్రేయసీ! ఇందిరా! నన్ను నీవెట్లు లెఱింగితివి? ఇంత కాల మెచ్చట నుంటివి? నీవృత్తాంతమంతయు సవిస్తరముగా వినఁగోరువాఁడ' నని చెప్పి యాబిడను తన తొడలపైఁ గూర్చుండఁజేసి మాటిమాటికి నాముద్దియ హస్తమును తన నేత్రములకు నద్దుకొనుచు 'ఇందిరా! చెప్పుము నీచరిత్రము. నీవెట్టి యిడుములను బడితివోయని నామది భీతిల్లుచున్నది.' అని తన చేతితో ఇందిర ముఖమును పయికెత్తి 'ఇందిరా! నీకాఁకలి కలుగుచున్నది కాఁబోలు. కొంచెము పాలు త్రాగెదవా?' యనెను.

ఇందిర—నాథా! నిన్ను చూచినంత మాత్రముననే నా కడుపు నిండెను. ఇఁక నాకు పాలు త్రాగవలయునని కోరికయు లేదు.

రాజ—అట్లైన నీవృత్తాంతము చెప్పుము.

ఇందిర—ప్రాణేశా! నాచరిత్రమువిన్న నీకేమి కోపము రాదుగదా. నే నొక్కపాపమును ఎఱుఁగని దాననని యాభక్తవత్సలుని యాన వచియించెదను.

రాజ—ఇందిరా! ఏలభయపడెదవు? నీకెవ్వ రెట్టి కీడు నొనరించిరి? చెప్పుము. ఇపుడేపోయి వారిం జించి చెండాడెదను. నీ వింతకాలమువఱకు నేల పూర్ణచంద్రవేషముతో నుంటివి?

ఇందిర—ప్రాణనాథా! మనమిరువురును ఒక్కనావయందు ప్రయాణము చేయుచుండఁగా దైవప్రేరణచే మన

పాపఫలము ననుభవించుటకై, ఒకరినొక రెడఁబాసి నసంగతి నీవెఱుఁగుదువుగదా. ఆనావ పగులునప్పుడు నాకొక్కటియు తెలియకుండెను. కొంతసేపటి కంత యు నేనొక ముండ్లకంప నడుమ చిక్కుకొనియుంటిని. నీవు కనఁబడనందుచే నపుడు నాపాదనుండి తప్పించు కొనవలయునను తలంపులేకుండెను. అది కొంతసేపటి కంతయు నొక్క దీవిని చేర్చెను. మెల్లమెల్లగా నే నా ముండ్లనుండి లేచి నిన్ను వెదకు సంభ్రమముచే నెం తోబడలికగానున్నను లక్ష్యపెట్టక, అందందు వెదకి చూచితినిగాని తుదకు నడువలేక కొంతసే పచ్చట నే పండుకొంటిని. రవ్వంతసేపటికంతయు నెవ్వరో నాచెం తకూర్చుండి నానోటిలో పాలు పిండుచుండుటచే నా కు కలిగిన శోష దీఱి కనువిచ్చి చూడఁగా, ఒక వృద్ధ పురుషుఁడు నాసమీపమున నుండుటగాంచితిని. ఆయ న నాయందు మిక్కిలి యాదరణముతో తనవెంటర మ్మని బలవంత పెట్టెను. నేను నందులకు సమ్మతింప కుండుటకు వీలులేమిచే ఒప్పుకొంటిని. నాభాగ్యవశ మున వారందఱు నన్ను పుత్రికాభావముతోనే యర యుచుండిరి ఆయన పుత్రియగు మాయక్కయు నన్ను సోదరీ భావముతోనే యాదరించు చుండెను. వేయి మాటలేల! నాకు నాతలిదండ్రులను వదలివచ్చిన ప్పుడయినను అంతదుఃఖము కలుగలేదుగాని వారిని విడువలేకవిడిచితిని' అనికన్నులనీరు కార్పఁదొడంగెను.

రాజ.—అయిన నేల నీవు వారిని విడిచిపెట్టి వచ్చితివి? అట్టిసజ్జనసహవాసము కలుగుట కష్టముగదా!

ఇందిర——నాథా! నేను సుఖముగా నొక్కచోటనుండు టకుఁగాదు వారిగృహమునకు పోయినది. వారు పలుమాఱు నిన్ను వెదకించెద మని చెప్పుటచే నచ టకి పోయిన దానను. పాపము వారు నిన్ను వెదకు నిమిత్తము మిక్కిలి శ్రమపడిరి. నాన్నగారు సహి తము వెదకుచుండిరి. ప్రథమమున నేను ఒక్కవత్స రము వఱకు నిన్ను వెదకి పిదపనెంపైన నొక్కకూప మునఁబడిచావవలయుననియే నిశ్చయించుకొనియుం టిని. కనుక నచట అయిదాఱుమాసములు వ్యర్థమగు టచే మఱియొక్క చోటికి పోయి నేనే నాయంతట వెతకవలయు ననితలఁచితిని. అదిచెప్పితినా, వారు సమ్మతింపరని యెఱిఁగి వారియొద్ద సెలవు గైకొనక యే అర్ధరాత్రివేళ వెడలివచ్చితిని. అదితలఁచుకొ న్ననాకు నిప్పటికిని దుఃఖముకలుగుచున్నది. వారు నేను లేనందున నెంతదుఃఖించిరో! తలఁచుకొన్ననా గుండె జల్లుమనుచున్నది. ఆగృహమును వీడి చాల దూరము నడచుచు నొకయరణ్యమును జేరి యించు క కూర్చుంటిని. అబ్బా! ఆయరణ్యమునందు ఒంటరి గా నేనెట్లుంటినో నాకేయెఱుక లేదు! నావిధిబలీయమై యుండుటచే నేనుండువనమునకు కొందఱుచోరులు

వచ్చిరి. నాథా! అనాథనైయున్న నేను, అప్పుడే
మి గావించియుండ వచ్చును?

రాజ—ప్రియా! నీచరిత్రము మహాద్భుతముగానున్నదిగా
ననేను చెప్పలేను. పిదపనీవేమిగావించితివో త్వరగా చె
ప్పుము. వారితోడ మంచిమాటలుసాగవుగాన నన్ను నే
నెఱింగించుకొంటినా, మోసము లేక వారితోఁబోరిజ
యించుటకు నాకు శక్తిచాలదు. కనుకఁగపట పాయ
ముతో వారిని గెలువవలయు నని యెంచి కపటనాట
కము నప్పు డభ్యసించితిని. ఆబూటకముచేతనే నిన్ని
పుడుపడయ నేర్చితిని. పిదప నేను వారినిజూచి వారు
నన్నేమియు నడుగకమునుపే మీరాఁడవచ్చెదనని చెప్పి
యెట్లో వారలకు నాయెడ నమ్మకము పుట్టించి, నేను
వ్రతముఁబూనియుండుటచే పురుషులుమాత్రము నాతో
మాటాడునపుడు మూడుగజములదూరములో నుండ
వలయు. ఆవ్రతమింక నొకమాసమే కలదని చెప్పి య
చ్చటనే యుంటిని. కొద్దికాలములోనే వారికి నాయం
దు మిక్కిలి నమ్మకకలిగించినందున నన్ను ఒంటిరిగా
విడిచిపోవునట్లు చేసితిని. ఒకనాఁడు వారందఱును
వాడుకప్రకారము చోరత్వముచేయుటకుఁ బోయియుం
డిరి. వెలుపల నొక కావలివానినుంచి పోవుటచే నేను
పైటికి వచ్చుటకు వీలులేదని మిక్కిలి దుఃఖించుచుం
డఁగా నచట నీ యంగుళీయకము గోచరమయ్యె
నని చెప్పి యాయుంగరమును రాజశేఖరునకు నిచ్చి,

ఇది చూచుటచే నిన్నాకూ్రాత్ములు చంపిరనియెను నిశ్చయించుకొంటిని. వారినెట్లో మోసపుచ్చి వెలుపలికి వచ్చి యెందైనను మరణింపవలయునని నిశ్చయించుకొని దానికిఁ దగునుపాయ మాలోచించి వారిలో పెద్దవాఁడగు వీరన్నతో 'నేను బూనియున్న వ్రతము నేపటితో ముగియుచున్నది గాన రేపు సూర్యోదయము గాకమునుపే యేటికిపోయి స్నానము చేసి గంగపూజ సలుపవలయు' నని చెప్పి వానినే మఱించి యేటియొద్దకుఁ బోవునపుడు నా వెంబడివచ్చిన కూలివానిచే నీయుంగరము దారియందు దొరకెనని వింటిని. అపుడు నీవు జీవించియే యుందువు. నీ వీదారిని బోవుచుండునపుడు నీచేతినుండి యిది జాఱిపడియుండునని నాకుఁ దోఁచెను. కనుక నాకు మృతినొందుటకు మనస్సు పుట్టినదికాదు. అందుచే వానిని దూరముగా నిలిపి 'స్నానముచేసినయనంతరము ర'మ్మని చెప్పిపోయి యందొక మఱ్ఱివృక్షము నెక్కి ఒక పెద్దరాతి నా యేటిలోఁ బడవైచితిని.ఆశబ్దమునువిని వాఁడు త్వరగా పరుగిడివచ్చి నే నానూతిలోఁ బడితినని నిశ్చయించుకొని యావృత్తాంతము వీరనాయకునకు నెఱింగించుటకై శీఘ్రముగా పరుగెత్తిపోవుచుండెను. వాఁడు కడుదూరము పోయినపిదప నాచెట్టును మెల్లగాదిగి యంతకుఁబూర్వ మెక్కిన యశ్వముపై నెక్కి యీదేశమునకు వచ్చిచేరినంత

విశ్రాంతి పొందుటకై యుద్యానవనమునకు పోయితిని. అచ్చట గూఢచారిని జూచితిని. పిదప జరిగినసంగతులన్నియు నీవే యెఱుఁగుదువుగదా. నాఁటిదినమే నేను నిన్ను గుర్తించితిని. అట్లు తెలిసియు నిన్నిదినములుగా నేల నాకెఱింగింపకుంటి వని యడిగితివేని చెప్పెదను. నాథా! నీకు నాయందు మునుపటి యట్లే ప్రేమగలదో, లేక యీనిర్భాగ్యురాలిని చేపట్టుటచే నిట్టి సంకటము వచ్చినదని నాయందు విసుగుగలిగి మొగమైనను చూడకపోదువో, యని శంకించి నీమనస్సు నెఱుఁగుటకై యింతకాలమువఱకు వేచియుంటిని. ఇంతలో నీయుద్ధ మొక్కటి దాపరించెను. నాసుకృతఫలముచే నేను మరల నిన్నుఁ జూడఁగంటిని. నిన్నటిదినము నేను నేఁటిరాత్రికి నెవ్వరికిఁ దెలియకుండ నిచటికి వచ్చి సకలవృత్తాంతమును నివేదించి నీవు నన్ననుగ్రహించినసరే, లేక త్యజించినయెడ నీపాదపద్మముల చెంతనే నాప్రాణములు సమర్పించుకొనెదనని యిట్లు నిశ్చయించి వచ్చితిని.

రాజ. నా భాగ్యలక్ష్మీ! ఎన్నఁడైనను నిన్ను నేను దప్పఁదలంతునే? ఇన్నిదినములయ్యును నామదిని నీవెఱుఁగకుండుటకు చింతిల్లుచున్నాను. నిన్నొకదానిని విడుచుటచేతఁగదా నాతలిదండ్రులను, నారాజ్యమునుగూడ దిగవిడిచితిని. నీ వొక్కతెమాత్ర మిదివఱకే నాకు లభియించియుండినచో ఆచక్రవర్తినిని వానిరాజ్యము

ను క్షణమాత్రమున పీనుఁగు పెంటనుగావించి యుం
దునే! చూడుము! ఇఁక నెలదినములలో నాచక్రవర్తి
పని యేమగునో.

ఇం. నాథా! నీకేమియు శ్రమవలదు. నాకుమాత్రము సె
లవొసంగిన చాలును. వానిని బిడారుచక్రవర్తిగాఁ
జేసెదను. నాకు యుద్ధమునందు పరిచయము కలదని
నీవెఱుఁగుదువు గదా.

రాజ. నేనుమాత్రముకాదు. లోకమంతయు నెఱుఁగును.
దానికి నిదర్శనము నీపాదాంగుష్ఠ మొక్కటియె చా
లును. అయ్యో! అపుడునీకెంత నొచ్చెనోకదా! నేనుం
డియు లేనివాఁడనే నైతిని. ఆపాపాత్ముని నేమిచేసినను
దీఱదు. రేపు నీవుతిరిగి పూర్ణచంద్రుఁడు కావలెనా.

ఇం. వలదు. ఇంక నేను నీయిందిరగానె యుందుదానను.

రాజ. అయిన నీయుదంతము రాజుగారికి నేమని యెఱిఁ
గింపవలయు? పూర్ణచంద్రుఁడు యుద్ధమున జయము
నొంది వచ్చుటచే గొప్పసమ్మానము పొందఁగలఁడని
దేశమంతయు నెఱింగి యున్నదే! అందులకేమి
చేసెదవు ?

ఇం.—నాథా! ఆ తొందర నీ కేల? నేనంతయుఁ జక్కఁ
జేసెదను. అర్ధరాత్రమయ్యెను. సుఖముగాఁ గొంత
నిద్రింతము రమ్మ' అని యిరువురును నిద్రించిరి. ఆహా!
ఆ దినమే కదా వారికి సుదినము! మఱునాఁటి యుద

యమున ప్రతాపసింగుమహారాజు సభాభవనము
నకు విచ్చేయునంతకు అచ్చోటంతయు జనసమూ
హములచే క్రిక్కిఱిసి యుండెను. కొంతసేపటికి
కంతయు సభ్యులొండొరులతో 'పూర్ణచంద్రుఁ డింక
నురాలేదు! ఏమికారణమో' యని గుసగుసలాడుచు
'రాజుగారును పలుకరింపకున్నారు. పెండ్లిసందడిలో
పెండ్లికొడుకునే మఱచినట్లున్నదే!' యనిరి. ప్రతాపసిం
గు తనమంత్రివంకఁజూచి. 'ఏల యింకనుమనపూర్ణచం
ద్రుఁడు రాలేదు? అప్పుడే జనులందఱు నుత్సాహము
దూలియున్నారు. ఇంకఁ గొంతసేపటికి రాకపోయె
నా యీసభయంతయు అల్లకల్లోలముతో ముగియఁ
గల' దని యనుచుండఁగా ఒక సేవకుఁడు వచ్చి నమ
స్కారముచేసి 'ప్రభూ! ఎవ్వరో యొక్క స్త్రీ ద్వార
మున తమ దర్శనార్థము వేచియున్నది' అని విన్న
వించెను.

ప్రతా—'ఎవ్వరాబిడ? రమ్మనుము.

ఇంతలో నొక స్త్రీ సభలోనికి ప్రవేశించి రాజుగారికి
వందనమాచరించి 'మహాప్రభూ! నాదిసింధుదేశము. అ
చ్చటినుండి కొండంతయాశతో మీ సన్నిధానమునకు
వచ్చియున్నాను' అనెను.

ప్రతాప—అమ్మా! నీది సింధుదేశమైన సంతోషమే. వారి
కందఱికి క్షేమమే కదా? నీవువచ్చినకార్యమేమి?

స్త్రీ—మహారాజా! మాయిందిర మీదేశమునం దున్నద నియెఱిఁగి మి మ్మాసోదరీదాన మడుగుటకై వచ్చితిని.

ప్రతాప.—అయ్యో! ఇదియేమివిచ్చి! అయిందిరయు రాజశేఖరుఁడును నదీప్రవాహమునఁబడి మృతులయిన సంగతి నీవెఱుఁగవు కాఁబోలు! వారు బ్రతికియుండిన మగధాధీశునకు నిట్టిపాటు కలిగియుండునా? నీకెవ్వరిట్టి కల్లవృత్తాంతములు చెప్పిరి?

స్త్రీ—'ప్రభూ! ఇదికల్లయా? ఇందిరా! రమ్ము. ఇందు నిన్నటిదినము నీవు నాకు భిక్షపెట్టునపుడు, నిన్ను నే నానవాలుపట్టితిని. నిన్నిట్టిగొప్పసభలోఁగాక వేఱు చోట బయలుపెట్టఁగూడ దని యూరకుంటిని' అని చెప్పెను.

ఆమాటలు విని యిందిర పులకాంకితయై యానంద ముతో లేచి వచ్చి, రాజుగారికి నమస్కరించి, తనగారాబు చెలియగు సుందరీభాయిని కౌఁగిలించుకొని. 'నీవిక్కడి కెట్లువచ్చితివి.?' అనియడిగెను.

సుందరి—నీవు నన్ను విడిచి పోయిననాఁడే నేనుగూడ నాగృహమును విడిచి నిన్ను వెదకునిమిత్తము దేశదేశములు తిరుగుచు మూఁడుదినముల క్రిందట నిట చేరితిని. నీవుపురుషరూపము ధరించి యశ్వముపై నెక్కి వచ్చునపుడు నిన్ను నేనుగుర్తించితిని. ఆసందేహము నివర్తించుటకై యొకభిక్షుకురాలివలె వచ్చి

నీచే భిక్షుకై కొనునపుడు. మఱింత స్పష్టముగా తెలిసికొంటిని.

ఇంతలో నారాజశేఖరుఁడు వచ్చి ప్రభువునకు నమస్కరించి జరిగినవృత్తాంత మంతయు నెఱింగించి ఇందిరయే యిన్ని దినములు పూర్ణచంద్రుఁడై యుండెనని చెప్పి యందులకు నిదర్శనముగా నామెపాదాంగుష్ఠమును జూపెను. అప్పుడు సభవారందఱు మహాశ్చర్యభరితులై యిందిరారాజశేఖరులను దీవించిరి. ప్రతాపసింగు ఈవృత్తాంత మంతయు నెఱిఁగి యిందిరశిరస్సుపై తన చేయిడి 'అమ్మా! నీచరిత్రము మహాద్భుతము' అని రాజశేఖరునివంకఁదిరిగి 'ఇన్ని దినములుగా మిమ్ము నేను సేవకభావముతో తలఁచినందులకు నన్ను క్షమింప వలయు. మనకందఱికి నిట్టిసంతోషము కలిగించినది యీసుందరియే కదా. కావున నీమెనెంతయు కీర్తింపఁదగు' ననఁగా జనులందఱు కరతాళధ్వనులచే నాభవనమును బోరుకొనఁజేసిరి. అంత ప్రతాపసింగు కడువృద్ధుఁడగుటచేతను, తనకు సంతతిలేనందునను, ఇందిరా రాజశేఖరులనే కన్నపుత్రులుగా నెంచి 'రాజశేఖరుని నారాజ్యమునకు నభిషిక్తునిఁ గావించెద' ననిపలికెను. అందులకు రాజశేఖరుఁడు వినయముతో 'ప్రభూ! నే నిప్పుడే వెళ్లి యాచక్రవర్తితో నాచేతులతీఁట దీఱ యుద్ధమాడవలయు. అందులకు సెలవియ్యవేఁడు చున్నవాఁడను. అంతకు నిందిరను మీరు చూచుకొనుచుండవలయును' అనెను.